# శ్రీదక్షిణామూర్తి స్తోత్రము

## స్వామి పరమానందనాథ

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.
ఆస్థాన విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత,
గండపెండేర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ,
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద

**డా॥ క్రోవి పార్థసారథి**

ప్రకాశకులు :
శివకామేశ్వరి గ్రంథమాల
41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,
విజయవాడ-520 013, ఫోన్ : 0866-2522824

# శ్రీదక్షిణామూర్తి స్తోత్రము

వివరణము

మాతా కరుణామయి

శ్రీమాతృదేవి విశ్వశాంతి ఆశ్రమ ట్రస్ట్

శ్రీపెనుశిల క్షేత్రము, పొట్టిశ్రీరాములు (నెల్లూరు) జిల్లా.

# శ్రీదక్షిణామూర్తి స్తోత్రము

**స్వామి పరమానందనాథ**

ప్రథమ ముద్రణ : 2017

ప్రతులు : 1000

సర్వ హక్కులు ప్రకాశకులవి

**వెల : రూ. 45-00**

ప్రతులకు :

1. **క్రోవి పార్థసారథి**
   23-11/1-10/2, ఓగిరాలవీధి,
   సత్యనారాయణపురం, విజయవాడ-11.
   ఫోన్ : 0866-2530672, 9866820574

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013.
   ఫోన్ : 0866-2522824

3. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777

# ప్రణతులు

దక్షిణ దిక్కుగా తిరిగి కూర్చున్న ఈశ్వరుడే దక్షిణామూర్తి. అజ్ఞానులైన జీవులను ఉద్ధరించటానికి అపారమైన కరుణ కలవాడు. ఆధ్యాత్మిక విద్యలో గురువుకు ప్రత్యేకమైన స్థానం ఉన్నది. ఏ పని ప్రారంభించాలన్నా ముందుగా గురువందనం చెయ్యటం సంప్రదాయం. జ్ఞానస్వరూపుడైన దక్షిణామూర్తికి నమస్కరిస్తూ చేసే ఈ స్తోత్రంలో ఆత్మతత్త్వాన్ని వివరించారు శంకర భగవత్పాదుల వారు.

దక్షిణామూర్తి మేధానిధి అని ప్రతీతి. తెలివితేటలు లేనివారు దక్షిణామూర్తిని ఉపాసిస్తే మేధావంతులవుతారు. దక్షిణామూర్తికి సంబంధించి అనేక మంత్రాలు, మూలామంత్రాలు కూడా ఉన్నాయి. ఆధ్యాత్మిక సాహిత్యంలో దక్షిణామూర్తి స్తోత్రం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ఇందులో మొత్తం పది శ్లోకాలు ఉంటాయి. వీటిలో **బ్రహ్మసత్యం జగన్మిథ్య, నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని** అనే విషయాలను వివరిస్తూ అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం జరిగింది.

ఆత్మజిజ్ఞాసువులు ఈ గ్రంథాన్ని సద్వినియోగం చేసుకుంటారని భావిస్తూ...

**స్వామి పరమానంద నాథ**

హేమళంబి నామ సంవత్సర
కార్తీక పూర్ణిమ, 2017

# మనవి

మా సంస్థ ద్వారా లోగడ శ్రీ క్రోవి పార్థసారథిగారిచే రచియింపబడిన అనేక శ్రీవిద్య, ఆధ్యాత్మిక గ్రంథములు పాఠకులకు అందజేసినాము. ప్రస్తుత గ్రంథమైన శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము వివరణముతో పాఠకులకు అందించుచున్నాము. ఈ గ్రంథమును మా సంస్థద్వారా ముద్రించి పాఠకులకు అందించుటకు అనుమతించిన శ్రీ క్రోవి పార్థసారథి గారికి ధన్యవాదములు.

శ్రీ దక్షిణామూర్తి జ్ఞాన స్వరూపముగా భక్తులు కొలిచెదరు. ఈ దక్షిణామూర్తి స్తోత్రము నిత్యము పఠియించు వారికి జ్ఞానవృద్ధి లభ్యమగునని పెద్దలు చెప్పెదరు. ఈ స్తోత్రము బహుళ ప్రచారములో నున్నది. పాఠశాలలో విద్యనభ్యసించు విద్యార్థుల నుండి జ్ఞానమును కోరుకొను పెద్దల వరకు అనేకమంది ఈ స్తోత్రమును నిత్యము పారాయణ చేయుచున్నారు.

భావము తెలుసుకొని పారాయణ చేసినచో స్తోత్రము నందలి విషయమును వివరముగా తెలుసుకొనవచ్చును. తద్వారా భక్తి జ్ఞానములను పొందవచ్చును. కావున ఆశ్రిత జనులెల్లరు లోగడ మా సంస్థ ద్వారా విడుదలైన గ్రంథములను ఆదరించిన విధముగానే ఈ గ్రంథమును కూడా ఆదరించి శ్రీ దక్షిణామూర్తి కృపకు పాత్రులు కాగలరని ఆశిస్తున్నాము.

**- ప్రకాశకులు**

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

**మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యుదానం**
**వర్షిష్ఠాంతే వసదృష్టిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః**
**ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందమూర్తిం**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥**

వయస్సులో పెద్దవారు, బ్రహ్మనిష్ఠను పొందిన వారు అయిన ఋషిగణాలు తనవద్దకు వచ్చి, చుట్టూ కూర్చుని తనను సేవిస్తూ ఉండగా, ఆనందరూపుడై చిన్ముద్రతో మౌనమే వ్యాఖ్యగా పరబ్రహ్మతత్త్వాన్ని బోధించేవాడు, లేతవయసులో ఉన్నవాడు, తనయందే రమించుచున్నవాడు గురువులలో శ్రేష్ఠుడు అయిన దక్షిణామూర్తికి నమస్కరిస్తున్నాను.

స్థావరజంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి అంటోంది **ఛాందోగ్యోపనిషత్తు**

1. అండజాలు – గ్రుడ్డు నుంచి పుట్టినవి. పక్షులు, పాములు మొ॥వి
2. ఉద్భిజాలు – విత్తనాల వల్ల భూమినుంచి పుట్టినవి. చెట్లు, చేమలు మొ॥వి
3. స్వేదదజములు – చెమటవల్ల పుట్టినవి, మలిన పదార్థము వలన పుట్టేవి, నల్లులు, దోమలు మొ॥వి
4. ఊష్మజాలు – వెచ్చదనం వల్ల పుట్టినవి. క్రిమికీటకాలు
5. జారజాలు – స్త్రీ జననాంగము నుంచి పుట్టినవి.

అయితే **ఐతరేయోపనిషత్తు**లో ఉద్భిజాలు, ఊష్మజాలు రెండూ కలిపి ఒకటిగానే చెప్పటం జరిగింది. దీనివల్ల జీవకోటి పుట్టుక నాలుగు రకాలవుతున్నది. ఇలా

ఆవిర్భవించిన జీవరాశిలో ఆఖరుదయిన జారజాలను జరాయుజములు (మావి అనే చర్మవిశేషము ఆవరించబడినవి) అని కూడా అంటారు. ఈ రకంగా 84 లక్షల రకాలైన జీవరాశి ఆవిర్భవించింది. అందులో మానవజన్మ శ్రేష్ఠమైనది. **జంతూనాం నరజన్మ దుర్లభమ్** ఎందుకని అంటే మానవుడికి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ చతుష్టయము ఉన్నది. వీటిలో–

| | | |
|---|---|---|
| మననం చేసేది | – | మనస్సు |
| నిశ్చయించేది | – | బుద్ధి |
| చింతించేది | – | చిత్తము |
| అనుభవించేది, అహంకరించేది | – | అహంకారము |

ఈ రకంగా చూస్తే మానవుడు కర్మలు చెయ్యటానికి, జ్ఞానసముపార్జన చెయ్యటానికి కూడా అర్హుడు. లోకంలో కర్మ చెయ్యాలంటే మానవుడు ఒకడికే సాధ్యం. చెట్లు చేమలు కర్మను చెయ్యలేవు. అవి ఉన్నచోటినుంచి కదల్లేవు. క్రిమికీటకాదుల జీవిత కాలం చాలా తక్కువ. ఒకటి రెండు రోజులు మాత్రమే 'మఖలో పుట్టి పుబ్బలో మాడింది' అంటారు. అంటే నిన్న పుట్టింది. ఇవాళ్ళ చచ్చింది. పశువులు పక్షులు ఇవి కర్మను చెయ్యలేవు. ఈ మూడు రకాలైన జన్మలు గతంలో తాము చేసిన కర్మను అనుభవించటానికే ఆవిర్భవించినాయి. ఇక మిగిలింది మానవుడు. సంపూర్ణమైన ఆకారం కలిగినవాడు. కాళ్ళు, చేతులు మొదలైన కర్మేంద్రియాలు, కన్ను ముక్కు మొదలైన జ్ఞానేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయం కలిగినవాడు. ఏది మంచిది? ఏది చెడు? ఏది చెయ్యాలి? ఏది చెయ్యకూడదు? అనే విషయాలుఆలోచించగలవాడు. ఫలానా పనిమాత్రమే చెయ్యాలి. దీనివల్ల ఈ రకమైన ఫలితము వస్తుంది అని నిశ్చయించగలవాడు. కర్మ చెయ్యాలి అంటే దేవతలైనా సరే మానవులుగా జన్మించాల్సిందే. అందుకే మానవజన్మ ఉత్తమమైనది అంటున్నారు. ఈ మానవులలో కూడా బ్రాహ్మణజన్మ మరీ ఉత్తమమైనది. గతజన్మలలో చేసిన మంచికర్మలవల్లనే బ్రాహ్మణుడుగా జన్మిస్తాడు. అయితే **జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః** జన్మచేత అందరూ శూద్రులే. కేవలం కర్మచేత మాత్రమే ద్విజులౌతున్నారు. ద్విజుడు అంటే రెండు పుట్టుకలు కలవాడు. జన్మించిన దగ్గర నుండి ఉపనయనము జరిగేవరకు శూద్రుడుగా పరిగణింపబడి, ఉపనయనము తరువాత చేసే కర్మను బట్టి బ్రాహ్మణుడు అవుతాడు.

బ్రాహ్మణుడు ఎవరు? అన్నప్పుడు -

అద్వితీయుడు, జాతి గుణక్రియారహితుడు, షడూర్ములు, షడ్వికారాలు, షడ్భావాలు లేనివాడు, సత్యజ్ఞాన ఆనందస్వరూపుడు, నిర్వికల్పుడు. నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు మాత్రమే బ్రాహ్మణుడుగా పరిగణించబడతాడు. అంటోంది **వజ్రసూచికోపనిషత్తు**

అసలు బ్రాహ్మణత్వం అంటే ఏమిటి?

1. బ్రాహ్మణత్వం అంటే - సత్యం
2. బ్రాహ్మణత్వం అంటే - ధర్మం
3. బ్రాహ్మణత్వం అంటే - నీతి
4. బ్రాహ్మణత్వం అంటే - నియమం
5. బ్రాహ్మణత్వం అంటే - నిష్ఠ
6. బ్రాహ్మణత్వం అంటే - విజ్ఞానం
7. బ్రాహ్మణత్వం అంటే - జ్ఞానం

బ్రాహ్మణుడుగా పుట్టటం గొప్పకాదు. బ్రాహ్మణుడుగా జీవించటం గొప్ప. **ధార్మిక లక్షణాలున్న వారెవరైనా బ్రాహ్మణులే.** 'బ్రాహ్మణ్యం' కులసంకేత పదంకాదు. గుణసంకేత పదం. సమాజశ్రేయస్సు కోరేవాడే బ్రాహ్మణుడు. కాబట్టి వారే ఉత్తమ జీవులుగా పరిగణించబడుతున్నారు. ఇటువంటి వారు కూడా సరియైన ఆత్మజ్ఞానం లేక నేను అంటే - దేహము, నేను అంటే - ఇంద్రియాలు నేను అంటే - అహంకారము అని భావిస్తున్నారు. కర్మబద్ధులై గానుగకు కట్టిన ఎద్దులాగా సంసార చక్రంలో పడి గిరాగిరా తిరుగుతున్నారు. కుడితి తొట్టిలో పడ్డ ఎలకలాగా, శ్లేష్మంలో పడ్డ ఈగలాగా సంసార సాగరంలోంచి బయటకు రాలేక కొట్టుమిట్టాడుతున్నారు.

ఆధిభౌతికములు - క్రూర మృగాలు, పాములవల్ల కలిగేవి

ఆధిదైవికములు - పిడుగుపాటు మొ॥ వైపరీత్యాలు

ఆధ్యాత్మికములు - జ్వరము మొ॥ దేహ బాధలు

ఈ రకమైన త్రివిధ తాపములతో బాధ పడుతున్నారు. ఇటువంటి మానవులను ఉద్ధరించాలనే ఉద్దేశ్యంతో పరమేశ్వరుడు దక్షిణామూర్తిగా అవతరించి, వటవృక్షం

క్రింద దక్షిణ ముఖంగా కూర్చున్నాడు. ఆయన పిన్నవయస్కుడు. పరమ జిజ్ఞాసువులు, పరబ్రహ్మ తత్త్వం తెలుసుకోగోరిన కొందరు వయోవృద్ధులయిన వారు. నిరంతరము సత్యాన్వేషణయందు ఉన్నవారు, బ్రహ్మవిద్య యందు ఆసక్తి గలవారు, తపోధ్యాన నిష్ఠాగరిష్ఠులు స్వామివారిని సమీపించి, తమ అనుమానాలు తీర్చుకోటానికి, కావలసిన జ్ఞానం పొందటానికి స్వామివారి ఎదురుగా కూర్చున్నారు. ఇప్పుడు పరబ్రహ్మ స్వరూపమైన దక్షిణామూర్తి వారియొక్క జిజ్ఞాసను గ్రహించినవాడై పరతత్త్వాన్ని ఉపదేశించాలి అనుకున్నాడు. అయితే పరబ్రహ్మము జాతి, సంజ్ఞ (పేరు), గుణ, క్రియాదులు లేనిది కావటంచేత జాతి నామగుణ క్రియా వాచక శబ్దాలలో దేనిచేతా కూడా వివరించటానికి వీలు లేకపోయింది. ఏదైనా ఒక విషయం చెప్పాలి అంటే ఈ నాలుగింటిలోను ఏదో ఒకటి ఉండి తీరాలి. పరబ్రహ్మమునకు ఇవి ఏవీలేవు. ప్రమాణముల చేత కూడా పరబ్రహ్మను గురించి తెలుసుకోవటానికి వీలుకాదు. ప్రమాణాలు ఆరు రకాలు.

1. ప్రత్యక్ష ప్రమాణము
2. అనుమాన ప్రమాణము
3. ఉపమాన ప్రమాణము
4. శబ్ద ప్రమాణము
5. అర్థాపత్తి ప్రమాణము
6. అనుపలబ్ధి ప్రమాణము

బ్రహ్మము సజాతీయ, విజాతీయ, స్వగత భేదము లేనిది. ఏ రకమైన మలములు లేనిది నిర్మలమైనది. మలములు ఐదు రకాలు

1. అణవమలము
2. కార్మికమలము
3. మాయికమలము
4. మాయేయమలము
5. తిరోధానమలము

ఈ రకంగా అవాఙ్మానసు గోచరమైన పరమాత్మను చెప్పాలంటే మాటలులేవు. **కేనోపనిషత్తు**లో చెప్పినట్లుగా **నచక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతినోమనః** ఆత్మ ఉన్నచోటికి కళ్ళు వెళ్ళలేవు. చెవులు వెళ్ళలేవు. మనసు వెళ్ళలేదు. అంటే ఇంద్రియాల వల్ల ఆత్మను తెలుసుకోవటం సాధ్యం కాదు. మరి ఎలా చెప్పాలి? అంటే మౌనమే శరణ్యము. కాబట్టి మౌనంతోనే వారికి పరబ్రహ్మతత్త్వాన్ని తెలియజెయ్యాలని సంకల్పించిన వాడై, జ్ఞానముద్రని చూపిస్తూ మౌనంగా ఉండిపోయాడు. ఆ మౌనస్థితే

అక్కడ ఉన్న జిజ్ఞాసువులకు పరబ్రహ్మతత్త్వాన్ని బోధించటమయింది. ఆ మౌనంతోనే శిష్యుల సంశయాలన్నీ తొలగిపోయి, వారికి జ్ఞానోదయం అయింది. అందుకనే దక్షిణామూర్తిని చెప్పేటప్పుడు

**చిత్రం వటతరోర్మూలే వృద్ధశిష్యా గురుర్యువా ।**

**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయః ॥**

మర్రిచెట్టు క్రింద యువకుడైన గురువు, ఆయన చుట్టూ వృద్ధులైన శిష్యులు కూర్చుని ఉన్నారు. గురువుగారు ఎవరికీ ఏమీ చెప్పటంలేదు. మౌనంగా ఉన్నారు. కాని శిష్యుల సందేహాలు మాత్రం పూర్తిగా తీరినాయి.

ఇక్కడ ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. కాని శిష్యుల మొహం చూస్తే వారి సంశయాలు తీరినట్లుగా ఆనందంగా కనిపిస్తున్నాయి.

**మౌనవ్యాఖ్య:'వాగింద్రియ నిగ్రహమే మౌనము'** అని లోకంలో ప్రసిద్ధి. నోటితో మాట్లాడకుండా ఉండటము. అదే మౌనము అంటారు. కాని శాస్త్రాల్లో అర్థం వేరుగా ఉంది.

వాచామగోచరుడైన పరమేశ్వరుడు మౌనస్వరూపుడు. వేదాలు కూడా ఆయన్ను వర్ణించలేవు. ఆ పరమేశ్వరుణ్ణి మనస్సుతో ఊహించను కూడా లేము. ముముక్షువులైన సాధకులు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై, గురువు యొక్క అనుగ్రహము సంపాదించి జ్ఞానస్వరూపుడు, మౌనముద్రాంకితుడు అయిన ఆయన్ను సాక్షాత్కరించుకొన్నారు. ఉత్తముడైన గురువు అంతే వాసులకు మౌనస్వరూపుడై సాక్షాత్కరిస్తాడు. అలా అపరోక్షంగా సాక్షాత్కరించటమే మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వము. అంటోంది **సనత్సుజాతీయము.** ఇప్పుడు అలా సాక్షాత్కరించిన గురువే దక్షిణామూర్తి.

**అవ్యాకృత విహారాయ సర్వవ్యాకృత సిద్ధయే**

**హృషీకేశ నమస్తేఽస్తు మునయే మౌనశీలినే ॥**

అంటోంది భాగవతం.

మౌనము అంటే ఆత్మారామత. మహాత్ములైన వారికి ఇది స్వభావసిద్ధంగా ఉంటుంది. మహాత్ములు ఆత్మారాములై, మౌనరూపులై ఉంటారు. వారియొక్క దర్శన మాత్రం చేతనే సాధకుల సందేహాలు, దోషాలు తొలగిపోతాయి. అజ్ఞానులైన వారు కూడా ఆత్మారాములవుతారు.

ఆత్మారాముడు అంటే నిరంతరము తన ఆత్మయందే క్రీడించేవాడు. అటువంటి వాడు మౌనస్వరూపుడు. **రామాయణంలో**

**తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీవాగ్విదాం వరమ్**

**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మని పుంగవమ్ ॥**

కాబట్టి ఇది గురుసంప్రదాయం. సద్గురువు ఎప్పుడూ మౌనంగానే ఉంటాడు.

**చిన్ముద్ర:** ఆ చెట్టు కింద దక్షిణామూర్తి **'కరకలితచిన్ముద్రం'** చేతితో రచించబడిన జ్ఞానముద్ర కలిగి ఉన్నాడు. చిన్ముద్ర అంటే జ్ఞానముద్ర. బ్రొటనవేలు, చూపుడువేలు రెండు వేళ్ళ చివరలు కలిపి ఉంచటాన్ని చిన్ముద్ర లేదా జ్ఞానముద్ర అంటారు.

**అంగుష్ఠ తర్జనీ యోగముద్రా వ్యాజేన సేవినామ్ ।**

**శ్రుత్యర్థం బ్రహ్మజీవైక్యం దర్శయన్నోవతాచ్ఛివః ॥**

ఇక్కడ దక్షిణామూర్తి అద్వైత సిద్ధాంతాన్ని బోధిస్తున్నాడు. అది ఎలాగా అంటే ఇందాక చెప్పినట్లుగా అంగుష్ఠము అంటే బ్రటనవేలు. తర్జని అంటే చూపుడువేలు. వీటిలో బొటన వ్రేలు పరమాత్మ. చూపుడువేలు జీవాత్మ. ఈ రెండూ కలిస్తే జీవాత్మ పరమాత్మల ఐక్యత. అదే మోక్షము లేదా సాయుజ్యము. దీన్నే జీవబ్రహ్మైక్యము అంటారు. చిన్ముద్ర చూపిస్తున్నాడు అంటే జీవాత్మ పరమాత్మలు రెండూ ఒక్కటే అనే అద్వైత భావాన్ని శిష్యులకు బోధిస్తున్నాడు. **నోవాచ్ఛిన్నః** అతడు సాక్షాత్తు ఈశ్వరుని అవతారము.

వేదాలు నాలుగు 1.ఋగ్వేదం 2. యజుర్వేదం 3.సామవేదం 4.అధర్వణవేదం. నాలుగు వేదాలకు కలిసి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. వాటిలో దశోపనిషత్తులు ముఖ్యమైనవి. వీటిలో నాలుగు ఉపనిషత్తుల నుండి నాలుగు మహావాక్యాలు తీసుకున్నారు.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదం |
| 2. | అయమాత్మా బ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదం |
| 3. | అహం బ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదం |
| 4. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదం |

సామవేదంలో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ, ఓ శ్వేతకేతూ ! ఆకాశంలో దివ్యమైనకాంతితో ప్రకాశించే సూర్యునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **'తత్త్వమసి'** అదే నీవు అంటాడు. ఈ వాక్యంలో మూడు పదాలున్నాయి. తత్ – పరమాత్మ (అది) త్వం – జీవాత్మ (నీవు) అసి–అయి ఉన్నాయి. శ్వేతకేతూ అదే నీవయి ఉన్నావు అంటాడు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనేది దీని అర్థం. మిగిలిన మూడు మహావాక్యాల అర్థం కూడా ఇదే.

**అంగుష్ఠం తత్పదం ప్రోక్తం తర్జనీ త్వం పదే స్థితా**

**తయోరైక్యతాస్సంధిః చిన్ముద్రా సా ప్రకీర్తితా ॥**

తత్ అది – అంగుష్ఠము. బ్రొటనవేలు

త్వం నీవు – తర్జనీ, చూపుడువేలు

అసి అనే పదము జీవ బ్రహ్మైక్యాన్ని సూచిస్తుంది.

**శుకరహస్యోపనిషత్తు**లో సదాశివుడు తత్త్వమసి అనే మహావాక్య మంత్రాన్ని శుకుడికి ఉపదేశం చేస్తాడు.

**గురువు :** పైన మొదటగా చెప్పిన శ్లోకంలో ఆచార్యేంద్రం అన్నారు. అంటే గురుశ్రేష్ఠుడు అని అర్థం. అసలు ఎవరు గురువు?

**గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః ।**

**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

గురువు త్రిమూర్తి స్వరూపుడు. ఆయనే పరమేశ్వరుడు. ఇది ఎలాగో చూడండి.

**గురుర్బ్రహ్మ :** గురువు సృష్టికర్త అయిన బ్రహ్మస్వరూపుడు. బ్రహ్మదేవునిపని సృష్టి చెయ్యటం. మరి ఇక్కడ గురువు ఏంచేస్తాడు? శిష్యుడి హృదయంలో జ్ఞానబీజాన్ని నాటతాడు. అంటే జ్ఞానాన్ని సృష్టి చేశాడన్న మాట. అందుకే గురువు బ్రహ్మస్వరూపుడు.

**గురుర్విష్ణుః :** విష్ణువు స్థితికారకుడు. లోకాలను పోషిస్తాడు. మరి గురువు ఏం చేస్తాడు అంటే – శిష్యుడి హృదయంలో నాటబడ్డ జ్ఞానబీజాన్ని మొలకెత్తేలా చేసి జాగ్రత్తగా పెంచుతాడు. అందుకే గురువు స్థితి కారకుడైన విష్ణురూపుడు.

**గురుర్దేవో మహేశ్వరః :** ఈశ్వరుడు అంటే త్రిమూర్తులలో మూడవవాడు రుద్రుడు. ఇతడు లయకారకుడు. నాశనం చేస్తాడు. గురువు దేన్ని నాశనం చేస్తాడు? శిష్యుడి హృదయంలో పెరుగుతున్న అజ్ఞానమనే కలుపు మొక్కలని నాశనం చేస్తాడు కాబట్టి గురువు ఈశ్వరుడు అనబడతాడు.

**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా :** త్రిమూర్తులు సృష్టి స్థితి లయాలు మాత్రమే చేస్తారు. కాని మోక్షానిచ్చేది పరబ్రహ్మమొక్కటే. మరి గురువు ఏం చేస్తాడు అంటే – శిష్యుడికి మోక్షమార్గాన్ని చూపిస్తాడు. అందుకే గురువు పరబ్రహ్మ అనబడుతున్నాడు. అలాంటి గురువుకు నమస్కారము అంటోంది **గురుగీత**. మహావాక్యార్థాన్ని వివరించి, సాధకుడికి మోక్షమార్గాన్ని చూపేవాడు గురువు. అందుకే గురువు పరబ్రహ్మ అనబడతాడు. అటువంటి గురువుకు నమస్కారము. జీవితంలో అనేకమంది గురువులు ఉండచ్చు. కాని మహావాక్యాల అర్థాన్ని వివరించి మోక్షమార్గం చూపేవాడే గురువు. **గురుగీత**లో గురువును గురించి చెబుతూ–

**అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

చరాచరమైన జగత్తంతా అఖండ మండలాకారంగా ఏ పరమాత్మ వ్యాపించి ఉన్నాడో, అటువంటి **తత్** పదము వాచ్యార్థాన్ని బోధించి చైతన్యాన్ని దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జంగమం వ్యాప్తం యత్కించి చిత్సచరాచరం ।**
**త్వం పదం దర్శితంయేన తస్మై శ్రీ గురవే నమః ॥**

సకల జీవరాశి యందు వ్యాపించిఉన్న త్వం పదవాచ్యమైన జీవస్వరూపాన్ని దర్శింపచేసే గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం స చరాచరం ।**
**అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

ముల్లోకాల యందు చిద్రూపంగా ఉన్న చైతన్యాన్ని 'అసి' అనే పదం ద్వారా దర్శింపచేయు సద్గురువుకు నమస్కారము.

మహావాక్యాల అర్థం చెప్పి, జీవబ్రహ్మైక్య సిద్ధాంతాన్ని బోధించి మోక్షమార్గాన్ని చూపేవాడే సద్గురువు. అటువంటి గురువే దక్షిణామూర్తి. అందుకే **ఆచార్యేంద్రం** అన్నారు శ్లోకంలో.

దక్షిణామూర్తి **'ఆత్మారాముడు'.** తనయొక్క ఆత్మలోనే క్రీడించేవాడు. మహాజ్ఞాని సాక్షాత్తు పరబ్రహ్మ. **ముదితవదనం** సంతోషంతో నిండిన ముఖం గలవాడు. **ఆనందమూర్తిం** బ్రహ్మానందంలో తేలియాడే వాడు. **తైత్తిరీయోపనిషత్తు**లో బ్రహ్మానందాన్ని గురించి చెప్పబడింది. లోకంలో మంచి యవ్వనంలో ఉన్నవాడు. ధనవంతుడు, విద్యావంతుడు, యజ్ఞయాగాది కర్మలు చేసే బ్రాహ్మణుడు పొందేది మానుషానందం. దానికి కొన్ని కోట్ల రెట్లుంటుంది పరబ్రహ్మ పొందే ఆనందం. ఇప్పుడు దక్షిణామూర్తి ఆనంద డోలికలతో తేలియాడుతున్నాడు. అందుకే ఆనందమూర్తి అన్నారు. అటువంటి దక్షిణామూర్తికి నమస్కారము.

మంత్రశాస్త్రంలో దక్షిణామూర్తి మంత్రానికి చాలా ప్రాముఖ్యత ఉన్నది. తెలివితేటలు తక్కువగా ఉన్నవారు మందబుద్ధులు దక్షిణామూర్తిని ఉపాసన చేస్తే వారి మేథస్సు పెరుగుతుంది.

**భస్మవ్యాపాండురాంగః శశికళధరో జ్ఞానముద్రాక్షమాలా**
**వీణాపుస్తై విరాజత్కరకమలో యోగపట్టాభిరామః ।**
**వ్యాఖ్యా పీఠేనిషణ్ణో మునివరనికరై సేవితం సుప్రసన్నః**
**సవ్యాళః కృత్తివాసాస్సతత మవతునో దక్షిణామూర్తి రీశః ॥**

వంటికి రాచుకున్న విభూదితో తెల్లగ ప్రకాశించేవాడు, చంద్రకళను ధరించిన వాడు, చేతులయందు చిన్ముద్ర, అక్షమాల పుస్తకము ధరించిన వాడు, యోగ పట్టాభిరాముడు, వ్యాఖ్యాన పీఠమునందు ఆసీనుడై మునీశ్వరులచే పరివృతుడైన వాడు, సర్పాలంకృతుడు అగు దక్షిణామూర్తి మనలను రక్షించుగాక.

మంత్రశాస్త్రంలో దక్షిణామూర్తి మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిలో మచ్చుకు కొన్ని

1. **మేధాదక్షిణామూర్తి :** ఓం నమో భగవతే దక్షిణామూర్తయే మహ్యం, మేధాం, ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా
2. **నవాక్షర దక్షిణామూర్తి : ఓం శ్రీం నమశ్శివాయ శ్రీం ఓం**

**3. హంస దక్షిణామూర్తి**

**ఓం నమో భగవతే దక్షిణామూర్తయే హంస స్సోహం**
**మహ్యాం మేధాం ప్రజ్ఞాం పయచ్ఛ స్వాహా ॥**

**4. సాంబ దక్షిణామూర్తి : ఓం ఐం నమః క్లీం శివాయ సౌః ॥**

ఇవి కాక దక్షిణామూర్తి మాలామంత్రం కూడా ఉంది. ఇంకా అనేక మంత్రాలు కూడా ఉన్నాయి. కృష్ణయజుర్వేదంలో దక్షిణామూర్తి ఉపనిషత్తు కూడా ఉంది.

శంకర భగవత్పాదుల వారు దక్షిణామూర్తి స్తోత్రాన్ని వ్రాశారు. దానికి సురేశ్వరాచార్యుల వారు **'మానసోల్లాసము'** అనే పేరుతో వార్తికాలు వ్రాశారు. వార్తికము అంటే - వార్తకు సంబంధించినది. వృత్తాంత సంబంధమైనది. వివరించునది. సూత్రాలలో చెప్పబడిన అర్థాన్ని వివరిస్తూ, అక్కడ చెప్పకుండా వదలివేసిన వాటిని చెబుతూ, అందులో దురుక్తము అంటే భిన్నంగా చెప్పిన వాటిని సరిచేసి చెప్పే సూత్రగ్రంథము. దానికి శ్రీరామతీర్థయతి **వృత్తాంతము** అనే పేరుతో వ్యాఖ్య వ్రాశాడు. ఇలా అనేకమంది ఈ స్తోత్రానికి వ్యాఖ్యలు వ్రాశారు. ప్రస్తుతము భక్తులకు ఒక మంచి పుస్తకాన్ని అందించాలనే సంకల్పంతో వ్యాఖ్యాత ఈ వ్యాఖ్యను అందిస్తున్నారు.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివో ద్భూతం యథా నిద్రయా ।**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమే వాఽద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 1**

కలలో మనయందే అంటే మన మనస్సునందే కనిపించేదంతా నిద్రవల్ల ఎక్కడో జరుగుతున్నది అనుకుంటాము. అలాగే అద్దంలో కనిపించే ప్రతిబింబం లాగా మన ఆత్మయందే కనిపించే ఈ ప్రపంచాన్ని మాయ, అజ్ఞానము కారణంగా ఎక్కడో బయట ఉన్నదానిలాగా చూస్తాము. ఆ మాయ గనక విడిపోతే ప్రపంచమంతా మనయందే ఉన్నదని తెలుసుకుంటాము. ఈ విధంగా తనకన్న వేరైన వస్తువు ఏదీ లేదని తెలియజెప్పే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

అవస్థలు మూడు. జాగ్రదావస్థ, స్వప్నావస్థ. సుషుప్తి. వీటినే అవస్థాత్రయము అంటారు. వీటిలో స్వప్నావస్థ అంటే నిద్రలో కలలు గనే స్థితి. ఈ స్థితిలో జీవుడు

కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలోని పురుషుని అనుభవాలే కలలో సాక్షాత్కరిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయముతో కంఠస్థానానికి వచ్చినప్పుడు జీవుడు కనేది కల. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము. ఈ స్థితిలో మనస్సు చిత్రవిచిత్రాలైన కల్పనలు చేస్తుంది. రాజులు, రథాలు, రాజ్యాలు, ఏనుగులు, గుర్రాలు, సైనికులు, యుద్ధాలు, జయాపజయాలు వీటన్నింటినీ ఊహించుకుంటుంది. తానే రాజైనట్లు భావిస్తుంది. మహదానందాన్ని అనుభవిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు కలిగినట్లుగా భావించి దుఃఖిస్తుంది. భయపడుతుంది. ఏడుస్తుంది. ఈ రకంగా స్వప్నంలో సుఖాలు, దుఃఖాలు అన్నీ అనుభవిస్తుంది. జాగ్రదావస్థలో లాగానే స్వప్నావస్థలో కూడా రాగద్వేషాలు, కామక్రోధాలు, దర్పము, మాత్సర్యము, అహంకారము, సుఖము, దుఃఖము, ఈర్ష్య, అసూయ అన్నీ ఉంటాయి. మెలకువ వచ్చిన తరువాత స్వప్నంలో కనిపించిన దృశ్యాలన్నీ ఎక్కడో జరిగినట్లుగా అనుకుంటాము. నిజానికి ఆ దృశ్యాలు, సంఘటనలు ఎక్కడో కాదు మన మనస్సునందే జరుగుతున్నాయి. మనస్సుచేత కల్పించబడుతున్నాయి. స్వప్నము మనస్సుచేత కల్పించబడిన అవస్థ. కాని మనం నిద్రలో ఉండటం వల్ల దీన్ని గుర్తించలేక ఎక్కడో ఈ విషయాలు, సంఘటనలు జరుగుతున్నాయి అని భావిస్తాము. మనం కూడా అక్కడికి వెళ్ళాం అనుకుంటాం. కాని అదేదీ నిజంకాదు. మనం ఎక్కడికీ వెళ్ళలేదు. ఆ దృశ్యాలు, సంఘటనలు మన మనస్సునందే జరుగుతున్నాయి. అయితే అసలు మనస్సు అంటే ఏమిటి?

**మనస్సు :** అంతఃకరణ చతుష్టయంలో ఒకటి మనస్సు. ఇది విషయాలను మననం చేస్తుంది. మనస్సు రెండు రకాలు

1. శుద్ధము – కామసంకల్పాలు లేనిది
2. అశుద్ధము – కామసంకల్పాలు కలది

మానవుల బంధ మోక్షాలకు కారణం మనస్సు. విషయాల యందు ఆసక్తిగల మనస్సు బంధాల వైపుకు, విషయాల యందు ఆసక్తి లేని మనస్సు మోక్షం వైపుకు నడిపిస్తుంది. ఈ మనస్సు యొక్క సంకల్పం వల్లనే స్వప్నం ఏర్పడుతుంది.

మనస్సు చాలా విచిత్రమైంది. మనస్సును గురించి కొన్ని నిజాలు చూద్దాం.

1. లేనిదాన్ని కావాలని కోరుతుంది.
2. ఉన్నది వద్దనిపిస్తుంది.

3. దూరంగా ఉన్నవి అందంగా ఊహించుకుంటుంది.
4. దగ్గరగా ఉన్నవి, చేతికి అందినవి పనికి రానివిగా భావిస్తుంది.
5. శాంతిని కలుగచేసే విషయాలు చికాకుగా అనిపిస్తాయి.
6. అశాంతినిచ్చేవి ఆనందంగా కనిపిస్తాయి
7. స్థిమితానికి – అస్థిమితానికి మధ్య ఊగిసలాట
8. అదే మనస్సు, మాయే మనస్సు. మనస్సే మాయ
9. మనస్సును జయిస్తే మాయను జయించినట్లే
10. మనస్సును కట్టడి చేస్తే మోక్షం వచ్చినట్లే
11. తెలిసినవారికి ఇది సిద్ధాంతం, తెలియనివారికి వేదాంతం

అలాగే అద్దంలో ప్రతిబింబంలాగా మన ఆత్మయందే కనిపించే ఈ ప్రపంచాన్ని మాయవల్ల ఎక్కడో బయట ఉన్నట్లుగా చూస్తాము. దీనికి కారణం మాయ. అదే అజ్ఞానము. మాయ అంటే ఏమిటి?

**మాయ :** అనాది అయినది, అంతము గలది, ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది మాయ. అది సత్తుకాదు, అసత్తు కాదు, సదసత్తు అంతకన్నా కాదు. స్వయంగా అధికమైనది. వికారములు లేనిది మాయ. వికారాలు అనగా మార్పులకు తల్లియై శాశ్వతమైన భగవదాజ్ఞా స్వరూపమైంది మాయ. దీనివల్లనే జగత్తులో అనేక సంఘటనలు జరుగుతాయి. మాయవల్లనే జగత్తు నిర్మించబడుతుంది. మాయ పరమేశ్వరుణ్ణి ఆశ్రయించి ఉంటుంది. అంతము గలది. భూతములందు ప్రకాశించేది మాయ. అనేక రంగులు, రకరకాల రూపాలు గలది మాయ. ఈ మాయవల్ల లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు కనిపిస్తుంది. దీన్నే అజ్ఞానము. జ్ఞానము లేకపోవటము అంటారు. ఆత్మను గురించిన జ్ఞానము లేకపోవటమే అజ్ఞానము. ఒక వస్తువును ఇంకొకటిగా ఊహించటం అజ్ఞానం. ఈ మాయవల్ల, అజ్ఞానం వల్ల ఈ జగత్తు ఎక్కడో బయట జరుగుతున్నది అని భావించటమే ముఖ్యమైనది. అది ఈ మాయ, అజ్ఞానం వల్ల జరుగుతోంది. ఈ అజ్ఞానం వల్లనే జగత్తు ఎక్కడో బయట ఉన్నట్లుగా అనుకుంటాము. అదే మాయ లేదా అజ్ఞానము. అజ్ఞానము వల్లనే ఈ జగత్తంతా మనస్సులోనే ప్రతిబింబిస్తుంది. చరాచర జగత్తులో బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిథ్య.

# బ్రహ్మసత్యం - జగన్మిధ్య

చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒకటే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిధ్య. భ్రాంతిచేత కల్పించబడింది. అజ్ఞానము చేత కల్పించబడింది.

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలను సృష్టించినట్లే ఈ జగత్తును మనస్సే సృష్టిస్తోంది. బ్రహ్మదేవుడు చేసేది సమిష్టి సృష్టి. జగత్తులోని జీవరాసి యొక్క సమ్మేళనమే బ్రహ్మదేవుడు. ఈ కారణం చేతనే బ్రహ్మ చేసే సృష్టి అందరికీ కనుపిస్తుంది. మనస్సులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు గాని, సృష్టి గాని కనుపించవు. స్వప్నంలాగానే ఈ జగత్తు అంతా కల్పనామాత్రము. మానవుడికి జ్ఞానం కలిగినట్లైతే ఈ జగత్తు నశిస్తుంది. ఒకవేళ ఈ జగత్తు గనక సత్యమైనది అయితే జ్ఞానం కలిగినా అది నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశించిపోతాయి. జ్ఞాన సముపార్జనతో నశించే వస్తువులు అసత్యమైనవి. దీనికంతటికీ కారణం మనస్సు. తన రచనాశక్తితో 84 లక్షల రకాలైన జీవరాసితో ఈ జగత్తును సృష్టించి బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తుంది. ఈ జగత్తంతా మనస్సువల్లనే కల్పించబడుతున్నది. యధార్థంగాచూస్తే సంసారంలేదు. మనస్సు పనిచేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారం కనుపించదు. మనస్సు ఉన్నచోటే లోకాలున్నాయి. మనస్సు లేకపోతే లోకాలు లేవు. సృష్టి లేదు. అసలు జగత్తే లేదు.

బ్రహ్మానికి జగత్తుకు ఏ రకమైన తేడా లేదు. జగత్తంతా బ్రహ్మము యొక్క మార్పు, భ్రాంతితో కూడిన రూపాంతరము. జగత్తుకు ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ బ్రహ్మమే. జగదుత్పత్తికి కారణాలు రెండు. 1.ఆరంభము 2.పరిణామము. ఆరంభంలో దారపు పోగులు కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. ఇందులో ఆరంభంలో ఉన్న లక్షణాలు పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలుపోగులు వస్త్రంగా ఏర్పడ్డప్పుడు నూలు పోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు వస్త్రం వేరు. రెండవది పరిణామము. ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలను తోడు వేస్తే పెరుగవుతుంది. కాని పెరుగులో పాల లక్షణాలు, రూపము కూడా ఉండవు.

అయితే జగత్తు ఆరంభము, పరిణామము రెండింటి వల్ల ఏర్పడలేదు. వివర్తము పరిణామము వల్ల ఏర్పడింది. అంటే భ్రాంతివల్ల ఒక వస్తువు ఇంకొక రకంగా కనుపిస్తుంది. అదే రజ్జు సర్పభ్రాంతి. పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టించలేదు. విత్తనం నుంచి చెట్టు వచ్చినట్లుగా, తండ్రి నుంచి తనయుడు పుట్టినట్లుగా, బ్రహ్మము నుంచి ఈ జగత్తు ఆవిర్భవించలేదు. వివర్తము అంటే కనుపించే రూపము. అవిద్య, అజ్ఞానం వల్ల కలిగిన అసత్యరూపము. అసలు ఇక్కడ జగత్తే లేదు. అంతా మాయ. అజ్ఞానంతో మనస్సు చేసిన కల్పనలవల్ల జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తోంది. అంతేకాని అసలు జగత్తే లేదు. బ్రహ్మదేవుడు మనస్సంకల్పంతో ఈ సృష్టి చేశాడు. ఇది సమిష్టి సృష్టి. అందుకే అందరికీ ఒకే రకంగా కనుపిస్తోంది. మనసున్న వాడికే జగత్తు కనుపిస్తుంది. మనస్సు లేని వాడికి ఈ జగత్తు లేదు. అజ్ఞానం వల్ల ఆవరించబడిన మాయతో ఈ జగత్తు సత్యము అనుకుంటాము. అజ్ఞానం గనక తొలగిపోతే ఈ జగత్తు ఉండదు. మిగిలేది ఒక్కటే అదే బ్రహ్మము. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య**. బ్రహ్మము జగత్తుల మధ్య తేడా లేదు. జగత్తు పరబ్రహ్మ యొక్క మార్పు. భ్రాంతి సిద్ధమైన రూపము. అంతే.

ఆరంభము పరిణామము వల్ల జనించినవి మాత్రం అధిష్ఠానానికి వికారము కలిగిస్తాయి. అసలు వస్తువు రూపాన్ని మారుస్తాయి. కాని వివర్తంలో అధిష్ఠానానికి ఏ రకమైన మార్పు, వికారము కలగదు. అధిష్ఠానానికి ఏ రకమైన మార్పు లేకపోయినప్పటికీ అజ్ఞానం వల్ల మార్పులు ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఈ కారణం చేతనే బ్రహ్మకు ఏ వికారాలు లేకపోయినా అనేక రూపాలు ఉన్నట్లుగా జగద్రూపంలో కనిపిస్తున్నాడు.

ఎడారిలో ప్రయాణం చేసేవారికి ఎండమావులు నీరులాగా కనిపిస్తాయి. అలాగే బ్రహ్మమును గురించి తెలియని అజ్ఞానులకు జగత్తు సత్యంగా కనుపిస్తుంది. అవి ఎండమావులు అనే జ్ఞానం కలిగినట్లైతే, ఎండమావులలో నీరు కనుపించదు. అలాగే జగత్తుకు అధిష్ఠానమైన బ్రహ్మము గురించి తెలియగానే జగత్తంతా పరబ్రహ్మగానే దర్శనమిస్తుంది. అంటే అప్పటిదాకా కనుపించిన జగత్తు ఏమవుతుంది? ఏమీ కాదు. ఇక్కడ నుంచి ఎక్కడికి పారిపోదు. పరబ్రహ్మలో లయమై పోదు. మరి ఏమవుతుంది? అంటే – బ్రహ్మరూపంలో నిలిచి ఉంటుంది. ఒక పదార్థంలో

అజ్ఞానంతో ఆరోపించబడిన వస్తువు, జ్ఞానభావన కలగగానే ఆధారమైన పదార్థము యొక్క స్వరూపముతో తప్ప ఇతరమైన దేనియందు లయమవటం గాని, ఎక్కడికైనా వెళ్ళిపోవటంగాని జరగదు. ఇదే రజ్జుసర్పభ్రాంతి. తాడును చూసి పాము అనుకుంటున్నాము. అది నిజంగా పాముకాదు. అజ్ఞానంతో దాన్ని పాము అనుకుంటున్నాము. ఇప్పుడు జ్ఞానం కలిగింది. అజ్ఞానం పోయింది. త్రాడులో ఉన్న పాము ఇప్పుడు లేదు. ఏమైంది? చచ్చిపోయిందా? పారిపోయిందా? నాశనమై పోయిందా? ఎక్కడైనా లయమై పోయిందా? అంటే ఏమీ కాలేదు. అది తన అధిష్ఠాన రూపంలో నిలిచిపోయింది. త్రాడు త్రాడుగానే మిగిలిపోయింది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. అజ్ఞానంతో నువ్వే దాన్ని పాము అనుకున్నావు. అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయింది. త్రాడే మిగిలింది. నీ అజ్ఞానం పోకముందు అక్కడ ఉన్నది త్రాడే. అజ్ఞానం పోయిన తరువాత అక్కడ ఉన్నది త్రాడే. అందులో ఏ మార్పు లేదు. ఉన్నదంతా నీ భావనలోనే ఉంది. అలాగే నీ అజ్ఞానంతో ఈ జగత్తును భావన చేశావు. అజ్ఞానం పోయిన తరువాత జగత్తు లేదు. కేవలము బ్రహ్మము మాత్రమే మిగిలింది. అందుకే **బ్రహ్మసత్యము జగన్మిథ్య**. నీ అజ్ఞానం పోకముందు ఇక్కడ జగత్తు లేదు. పోయిన తరువాత జగత్తు లేదు. పరబ్రహ్మలో జగత్తును నువు అజ్ఞానంతో భావన చేశావు. అజ్ఞానం కాస్తా పటాపంచలైపోయింది. ఇప్పటిదాకా చిమ్మచీకట్లు క్రమ్ముకున్నాయి. ఆ చీకటిలో అనేక రకాలైన భూతాలు, పిశాచాలు, దెయ్యాలు కనుపించాయి. ఇప్పుడు జ్ఞానజ్యోతులు వెలిగాయి. ఆ దివ్యమైన ప్రకాశంతో చీకటి ఎగిరిపోయింది. ఇప్పుడు యధార్థం గోచరిస్తోంది. అక్కడ దెయ్యాలు, భూతాలు ఏవీలేవు. అదంతా నీ భ్రాంతి. ఆ భ్రాంతి తొలగిపోయింది. అలాగే ఇక్కడ కూడా అజ్ఞానమనే చీకట్లు తొలగిపోగానే అప్పటివరకు కనుపించిన జగత్తు కనుపించకుండా పోయింది. ఎక్కడికి పోయింది అంటే భ్రాంతి పోయింది అంతే. అసలు అక్కడ జగత్తే లేదు. అది ఎక్కడికీ పోలేదు. దేనిలోనూ లీనం కాలేదు. ఈ జగత్తంతా భ్రాంతి అనే మాటను నువ్వు తెలుసుకున్నావు. ఉన్నది ఒక్కటే. సత్యము, నిత్యము శాశ్వతము అయిన పరబ్రహ్మ. నామరూపాత్మకమైన జగత్తంతా భ్రాంతిచే కల్పించబడింది. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య.**

అజ్ఞానం వల్ల ఆవిర్భవించిన జగత్తు జ్ఞానంవల్ల అదృశ్యమై పోతుంది. తన అధిష్ఠానంలో లీనమవుతోంది. కలలో జరిగిన విషయాలు మెలకువ రాగానే ఎలా కరిగిపోతాయో, అలాగే జ్ఞానం కలగగానే జాగ్రదావస్థలోని జగత్తు అదృశ్యమై పోతుంది. తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. ఇక్కడ మనస్సు తన అజ్ఞానంతో జగత్తును ఊహించుకుంటోంది. ఇదంతా ఊహ, కల్పన, భ్రాంతి. అయితే ఇక్కడ చిన్న తేడా ఉంది. కలలోని వస్తువులు మెలకువ రాగానే కరిగిపోతాయి. కాని జాగ్రదావస్థలో అలా కాదు. వస్తువులు కంటికి కనుపిస్తాయి. వాటిని చేత్తో తాకుతాము. అనుభవిస్తాము. వివాహం చేసుకున్నాడు. భార్య ఇంటికి వచ్చింది. తనతోనే ఉంటుంది. ఇల్లు కట్టుకున్నాడు. గృహప్రవేశం చేశాడు. ఆ ఇంట్లోనే ఉంటున్నాడు. తన భార్య, పిల్లలు, ఇల్లు ఇవన్నీ కళ్ళ ఎదురుగా కనుపిస్తూనే ఉన్నాయి. వాటిని తాను అనుభవిస్తూనే ఉన్నాడు. అందుకే ఇవన్నీ సత్యము అనుకుంటున్నాడు. మంచి గురువును ఆశ్రయించి, ఆయనకు శుశ్రూష చేసి, జ్ఞానసముపార్జన చేసిన తరువాత, జాగ్రదావస్థలోని విషయాలు కూడా స్వప్నంలోని విషయాలలాగానే అసత్యము, ఇదంతా భ్రాంతి అనే విషయం తెలుస్తుంది. అప్పుడు దృశ్యమానమైన జగత్తు అదృశ్యమై పోతుంది. ఆ సమయంలో ఇంక మిగిలేది ఒక్కటే. అధిష్ఠానమైన బ్రహ్మము. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య.** ఇది అద్వైత సిద్ధాంతము.

సముద్రంలో ముత్యపుచిప్ప తేలియాడుతోంది. దాన్ని చూసి వెండిపాత్ర అనుకున్నాం. అది ముత్యపుచిప్ప అని తెలియగానే వెండిపాత్ర కనుపించదు. త్రాడును చూసి పాము అనుకున్నాం. అది త్రాడు అని తెలియగానే ఇంక పాము కనుపించదు. అలాగే జగత్తుకంతటికీ అధిష్ఠానమయిన పరబ్రహ్మ స్వరూపం గురించి తెలియనంత వరకు నామరూపాత్మకమైన జగత్తే కనుపిస్తుంది. జ్ఞానం కలిగిన తరువాత ఇది బ్రహ్మము అని తెలిస్తే దృశ్యమానమైన జగత్తు ఇంక ఉండదు. అన్నీ అంతర్ధానమై పోతాయి. ఇక్కడ అంతర్ధానము అంటే పూర్తిగా నశించిపోతాయని, నామరూపాలు ఏవీ ఉండవనీ కాదు. అజ్ఞానం వల్ల ఇంకో రకంగా ఆరోపించిన వస్తువులను జ్ఞానంతో యధార్థంగా తెలుసుకోవటం. అప్పుడు జగత్తు నశిస్తుంది. అంటే పూర్వస్థితికి వస్తుంది. తన రూపాన్ని తాను సంతరించుకుంటుంది. తనరూపము బ్రహ్మము. కాబట్టి జగత్తంతా బ్రహ్మముగానే కనుపిస్తుంది. బ్రహ్మకన్న వేరైన పదార్థం ఏదీ ఉండదు. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య**. జగత్తు ఎన్నటికీ నశించదు. ఒకసారి

నశించినది మళ్ళీ పుడుతుంది. కాని అజ్ఞానము అలాకాదు. అజ్ఞానము ఒకసారి నశిస్తే మళ్ళీ పుట్టదు. నీటిమీద తేలియాడుతున్న ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అనుకున్నాడు. ఇప్పుడు కాదని తెలిసింది. రెండవసారి ముత్యపుచిప్ప కనుపించినా అది వెండిపాత్ర అనుకోడు. భ్రాంతి గనక ఒకసారి నశిస్తే మళ్ళీ జనించదు. ఒకవేళ జనించినా అది భ్రాంతి అని వెంటనే తెలుస్తుంది. కాబట్టి **జగత్తు అనిత్యము అని తెలుసుకున్న వాడు మళ్ళీ జగత్తు సత్యము, నిత్యము అని ఎప్పటికీ నమ్మడు.**

ఈ విషయం అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలంటే ముందు మనస్సును అదుపులో పెట్టుకోవాలి. దాన్నే మనోజయము, మనోనాశనము అంటారు.

## మనోజయము

మనోజయము అంటే మనస్సును జయించటం. దీన్నే మనోనాశనము అని కూడా అంటారు. **'మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'**

బంధ మోక్షాలకు కారణం మనస్సు. **మమ** అనుకుంటే బంధం **'నమమ'** అనుకుంటే మోక్షం. మనస్సుతోనే సంసారం సృష్టించబడుతున్నది. ఏ పదార్థం మీద మనకు ప్రేమ అభిమానం ఉంటుందో దాని స్వరూపంగానే మనస్సుంటుంది. ఇది మనస్సు యొక్క లక్షణం. మోక్షం కావాలి అంటే మనస్సును అదుపులో పెట్టుకోవాలి. మనస్సు ఎప్పుడూ అదుపులో ఉండదు. ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకి దూకుతూ ఉంటుంది. పరుగులు పెడుతుంది. ఇంద్రియాలు మనస్సు యొక్క అధీనంలో ఉంటాయి. మనస్సు సక్రమంగా ఉంటే ఇంద్రియాలు సక్రమంగానే ఉంటాయి. మనస్సు సక్రమంగా ఉండటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనల యందు చిక్కకుండా ఉండటం. ఎవరి మనస్సు విషయ వాసనల యందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనస్సును జయించినట్లే. అజ్ఞానాన్ని వదిలి జగత్తంతా బ్రహ్మమయము అని భావన చేయగలిగినవాడే మనస్సును జయించినవాడు. మనసును జయించటం తేలిక కాదు అంటారు. ఇది అజ్ఞానులు చెప్పే మాట. ఆత్మజ్ఞానం కల పురుషుడికి మనస్సును జయించటమనేది కళ్ళుమూసి తెరిచినంత తేలిక. 'సర్వవ్యాపకుడైన బ్రహ్మమును నేనే' అని భావించిన వాడి మనస్సు అతని అదుపులోనే ఉంటుంది. జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడినదే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు అని తెలుసుకోవటమే

మనోజయము. చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనస్సుతో భావించబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞాని మనస్సు అదుపులో ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞానిమనస్సు అదుపులో ఉంటుంది.

ఈ రకంగా మనస్సును లౌకిక విషయాల యందు లగ్నం కానీయకుండా కట్టడి చేసి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగినవాడే మనస్సును జయించిన వాడు. **మోక్షం కావాలంటే మనోనాశనము జరిగి తీరాలి.**

**యత్రాసక్తిర్మనస్తత్ర తదాకారేణ తిష్ఠతి ।**

**స ఏష మనసో ధర్మః స్వానుషక్తాత్మనా స్థితిః ॥**

ఏ పదార్ధము మీద మనకు ప్రేమ ఉన్నదో మనస్సు ఆ పదార్ధము యొక్క స్వరూపముతోనే ఉంటుంది. తనయందు ప్రేమ అనే పాశముతో బంధింపబడి ఉన్న వస్తువునందుండుట మనస్సు యొక్క లక్షణము.

మనస్సును జయించాలి అంటే మనస్సును వశంలో పెట్టుకోవాలి. మనస్సు ఎప్పుడూ అదుపులో ఉండదు. శాఖాచంక్రమణం చేస్తుంటుంది. ఒక విషయం నుంచి ఇంకో విషయానికి పరుగులు పెడుతుంది. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా

**యస్త్వ విజ్ఞానవాన్భనత్య యుక్తేన మనసా సదా ।**

**తస్యేంద్రియాణ్యనశ్యాని, దుష్టాశ్యా ఇవసారథేః ॥**

చంచలమైన మనస్సు కలిగి సరియైన విజ్ఞానము లేని వాని ఇంద్రియాలు సారథి వశములో లేని దుష్టాశ్వముల వంటివి. ఇంద్రియాలు తమ ఇష్టానుసారం చరిస్తాయి. పరుగులు పెడతాయి.

**యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా ।**

**తస్యేంద్రియాణి నశ్యాని, సదశ్వా ఇవసారథేః ॥**

విజ్ఞానవంతుని ఇంద్రియాలు మంచి సారథి వశంలో ఉన్న గుర్రాల వలె వశంలో ఉంటాయి.

కాబట్టి మనస్సును బట్టే ఇంద్రియాలు చరిస్తుంటాయి. ఇంద్రియాలు ఎక్కడ ఉంటాయి అంటే వాటికి ఒక స్థానం ఉంది. కాని మనస్సుకు స్థానం లేదు. మనకు ఏ పదార్ధము మీద ప్రేమ ఉన్నదో ఆ పదార్ధములో మనస్సు ఉంటుంది.

**విషయాకార తాపత్తి వృత్తిర్యేన నిగృహ్యతే ।**

**విపశ్చితా మనస్తేన నిర్జితం నాత్ర సంశయః ॥**

ఏ మహానుభావుడైతే శబ్దాది విషయాలకు చిక్కకుండా మనస్సును నిగ్రహించు కుంటాడో అతడు మనస్సును జయించిన వాడు.

మానవుడు ఈ జగత్తంతా పరబ్రహ్మ కన్న వేరైనది. నామరూపాత్మకమైనది. అని భావన చేస్తే, మనస్సు కూడా బ్రహ్మకన్న వేరైన ఆకారంగానే జగత్తును చూస్తుంది. అలా కాదు జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే, అని భావిస్తే బ్రహ్మముగానే కనుపిస్తుంది. కాబట్టి ఎవడు మనోనిగ్రహం కలిగి ఉంటాడో, అంటే జగత్తు పరబ్రహ్మ స్వరూపమే తప్ప నామరూపాత్మకం కాదు. దృశ్యమానం కాదు అని నిశ్చయించుకుని విషయ వాంఛల యందు మరలనీయక మనస్సును నిగ్రహిస్తాడో అతడు మనస్సును జయించినవాడు. దృశ్యమానమైన జగత్తును చూస్తూ కూడా ఇదంతా పరబ్రహ్మ స్వరూపము అని భావన చేసినవాడే మనస్సును జయించినవాడు. వాస్తవస్థితిలో జగత్తుకు నాశనమనేది లేదు. కాబట్టి ఏ పదార్థము ఎలా కనుపించినప్పటికీ ఇదంతా పరబ్రహ్మమే అని భావన చేసేవాడే మనస్సును జయించిన వాడు. ఈ కుండ బ్రహ్మము కన్న వేరైనది అనే భావన వదిలి, కుండకు నామరూపాలు మాత్రమే క్రొత్తవై ఉన్నాయి. వాస్తవస్థితిలో సర్వకారణమైన బ్రహ్మముకన్న ఇది వేరు కాదు. అని భావించి ఇది కుండ అంటున్నప్పటికీ, చిత్తములో అలాంటి భావన లేకుండా ఇది కూడా బ్రహ్మమే. అనే భావన కలిగి ఉండటమే తత్త్వజ్ఞానానికి ఫలితము. కాబట్టి అనాదిగా వస్తున్న అజ్ఞానాన్ని వదలి అంతటా బ్రహ్మభావన చేసినట్లైతే, అప్పుడు మనస్సు కూడా బ్రహ్మాకారముతో పరిణమిస్తుంది. దీన్నే **మనోజయము** అంటారు. ఇదే **పురుషార్థము.**

“ఏ పదార్థము ఏ స్వభావంతో కనిపించినప్పటికీ అదంతా, ఆ స్వభావంతో కనుపించే పదార్థమంతా పరబ్రహ్మమే. అంతకన్న వేరైనది లేదు. కాబట్టి కంటికి కనుపించేది, చెవులకు వినిపించేది అంతా పరబ్రహ్మమే” అని తెలుసుకోవటమే తత్త్వజ్ఞానము.

**ఉన్మేషశ్చ నిమేషశ్చ మకరః సాద్యథా తథా ।**

**మనోజయోఽపి సుకరః పురుషస్యాత్మ వేదినః ॥**

కళ్ళు తెరవటం మూయటం ఎంత తేలికో, ఆత్మజ్ఞానము గల పురుషుడికి మనస్సును జయించటం కూడా అంతే తేలిక.

కళ్ళు తెరవటం, ముయ్యటం అనేది ఇద్దరికే కష్టం. 1.నిద్రలో ఉన్నవాడికి 2.మూర్ఛపోయిన వాడికి. లేదా మరణించిన వాడికి జాగ్రదావస్థలో ఉన్న వాడికి ఇది చాలా తేలిక. తనకు తెలియకుండానే ఈ పని జరిగిపోతుంది. అలాగే చరాచర జగత్తు బ్రహ్మకన్న వేరైనది అనే భ్రాంతిలో ఉన్నవాడు మనస్సును జయించలేడు. జగత్తుకు బ్రహ్మకు భేదం లేదని తెలిసిన వాడికి మనస్సును జయించటం చాలా తేలిక.

మనస్సును జయించిన వాడికి, మనోలయం చేసిన వాడికి ఈ జగత్తు కనిపించదు. అందుకే మహాజ్ఞానుల దృష్టిలో జగత్తు లయమై పోతుంది. ఇక్కడ ఒక విషయం గుర్తించాలి. జ్ఞాని దృష్టిలో మాత్రమే జగత్తు లయమై పోతుంది. కాని మిగిలిన అజ్ఞానులకు మాత్రం జగత్తు ఎక్కడికీ పోదు. అక్కడే ఉంటుంది. సాధకుడికి అజ్ఞానం నశించగానే దృశ్యమానమైన జగత్తు నశించిపోతుంది. ఇక ఏ రకమైన భ్రమలు ఉండవు. ఇక్కడ నశించిపోవటమంటే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. ఈ రకంగా ఆత్మతత్త్వాన్ని ఉపదేశించి, వివరించి బ్రహ్మము ఒక్కటే సత్యము ఈ జగత్తంతా మిధ్య అని తెలియచేసే సద్గురువే దక్షిణామూర్తి.

**ఆత్మ:** స్వస్వరూపమైన ఆత్మలాభంకన్న ఉత్కృష్టమైనది ఇంకేదీ లేదు. అందుచేత ఆత్మస్వరూపాన్ని పొందటానికి శంకర భగవత్పాదుల వారు పరమాత్మను స్తుతి చేస్తున్నారు. అసలు ఆత్మ అంటే ఏమిటి? దానివల్ల లాభం ఏమిటి?

**యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ**
**యచ్చాస్య సన్తతోభావ స్తస్మాదాత్మేది గీయతే ॥**

"జాగ్రస్వప్న సుషుప్తి రూపమైన అవస్థాత్రయంలో ద్రష్టయైన నిత్యత్వమే" ఆత్మ.

ఆత్మ అంటే స్వస్వరూపము. అందుకే అది నిత్యప్రాప్తమై ఉన్నది. ఆత్మప్రాప్తి అంటే – ఆత్మజ్ఞానము. ప్రత్యగాత్మను బ్రహ్మముకన్న వేరుగా భావించే అజ్ఞానాన్ని నాశనం చెయ్యటమే ఆత్మలాభము. ఆత్మజ్ఞానము సర్వోత్కృష్టమైనది. ఆత్మలాభం కోసం మునీశ్వరులు ఋషీశ్వరులు సర్వాన్నీ త్యాగం చేస్తారు. అటువంటి ఆత్మలాభాన్ని పెంపొందింపచేసే గురువు ఈశ్వరస్వరూపము అయిన దక్షిణామూర్తిని స్తుతి చేస్తున్నారు శంకరులవారు ఈ శ్లోకంలో.

**బీజస్యాఽంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః**
**మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం ।**
**మాయావీవ విజృంభయ త్యపి మహా యోగీవ యస్స్వేచ్ఛయా**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 2**

మనకంటికి కనిపిస్తున్న ఈ జగత్తంతా సృష్టికి ముందు విత్తనంలో ఇమిడి ఉన్న మొక్కలాగా నామరూపాలు లేకుండా పరమేశ్వర స్వరూపంగానే ఉండేది. తరువాత కొంత కాలానికి అంటే సృష్టి జరిగినప్పుడు ఒక గారడీవాడు లేదా మహాయోగిలాగా పరమాత్మను ఆశ్రయించి ఉన్న మాయాశక్తి చేత కల్పించబడిన దేశకాలమానములను వానిచే నిర్వికల్పమైన ఆ జగత్తు అను విత్తనంలోంచి మొక్క వచ్చినట్లుగా అనేక రూపాలతో, అనేక పేర్లతో చిత్రవిచిత్రమైన ప్రపంచముగా విజృంభింపచేసే గురుదేవులైన దక్షిణామూర్తికి నమస్కారము.

ఈ శ్లోకంలో భగవత్పాదులవారు మాయావాదాన్ని వినిపిస్తున్నారు. **యామా సా మాయా** ఏదైతే లేదో అది మాయ. లేనిదాన్ని ఉన్నట్లుగా చూసేది మాయ.

అనాది అయినది, అంతము గలది, ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది మాయ. ఇది సత్తుకాదు. అసత్తు కాదు. సదసత్తు అంతకన్నా కాదు. స్వయంగా అధికమైనది. వికారాలు లేనిది. నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

జీవులకు అజ్ఞానము నశించిపోయిన తరువాత సత్త్వగుణం ప్రధానంగా గలవారికి ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. అజ్ఞానులకు అది సాధ్యంకాదు. వికారాలకు అంటే మార్పులకు తల్లియై, శాశ్వతమైన భగవదాజ్ఞారూపమైనది మాయ. ఈ మాయవల్లనే జగత్తులో అనేక సంఘటనలు చోటు చేసుకుంటున్నాయి. మాయవల్లనే జగత్తు నిర్మించబడుతోంది. మాయ అనేది పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. ఇది గౌరవమైనది. అంతము గలది. సృష్టించేది. భూతములందు ప్రకాశించేది, తెలుపు, ఎరుపు, నలుపు మొదలైన అనేక రంగులు గలది. అనేక రూపాలు గలది, కోరికలు కలిగించేది. కోరికలు తీర్చేది. విషయశూన్యమైనది. ఈ మాయవల్ల ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనిపిస్తుంది. నిత్యము సత్యము శాశ్వతము అయినది పరమేశ్వర స్వరూపం. కాని మాయా ప్రభావంతో భగవంతుడు లేడు

అనిపిస్తుంది. అశాశ్వతమైన జగత్తు శాశ్వతము అనిపిస్తుంది. భార్యాబిడ్డలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఇవన్నీ నిజం అనిపిస్తుంది. లోకంలో జీవి వాటికోసమే పాకులాడుతుంది. కాని ఇవన్నీ నశించిపోయేవే. ఎడారిలో ఎండమావిలాగా, ముత్యపు చిప్పలో వెండి పాత్ర కనిపించినట్లుగా మాయాప్రభావం చేత అశాశ్వతమైనవన్నీ శాశ్వతంగా అనిపిస్తాయి. నిత్యమైనవి అనిత్యంగా అనిపిస్తాయి. మాయాప్రభావం చేతనే మానవుడు తాను సృష్టించిన ద్రవ్యాన్ని సంపాదించటానికి తానే పరుగులు పెడుతున్నాడు. ఈ జగత్తంతా నిజమనే భ్రమలో ఉంటాడు. ఈ మాయ ఎంత గొప్పది అంటే తన కళ్ళ ఎదురుగా జీవులు మరణిస్తున్నా, కట్టడాలు కూలిపోతున్నా, వస్తువులు నశిస్తున్నా మానవుడు అది నిజమని నమ్మలేడు. చివరకు తన జీవితం శాశ్వతం కాదు అని తెలిసినా దానిమీద వ్యామోహాన్ని వదులుకోలేడు. అహంకార మమకారాల నుంచి బయటకు రాలేడు. జీవుడు అవిద్యా సంబంధంతో మాయ అనే వలలో గట్టిగా చిక్కుకుపోయాడు. సృష్టి క్రమంలో మొదటిదయిన అవ్యక్తమే మాయ. అవ్యక్తము అంటే కంటికి కనిపించనిది. అదే మాయ. ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. జీవుడికి పరమేశ్వరుడికి మధ్యన అడ్డుగా ఉంటుంది. ఈ మాయను గనక ఛేదించగలిగితే ఆత్మసాక్షాత్కారమవుతుంది.

మాయ అనేది నీటిగుంటలో నాచులాంటిది. ఈ నాచును దూరంగా తోసేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీ వచ్చి చేరుతుంది. అలాగే వేదాంత విచారము, సజ్జన సాంగత్యము చేసినంత కాలము ఈ మాయ వదిలేసినట్లుగా కనిపిస్తుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చి చేరుతుంది. విషయవాంఛల యందు మనస్సు ఎప్పుడు లగ్నమవుతుందో, అప్పుడు మాయ ఆవరించింది అని అర్థం. జగత్తులో ప్రతిప్రాణి మాయకు లోబడే ఉంటుంది. పరమేశ్వరుడు మాత్రమే మాయకు అతీతుడు. మాయ ఎప్పుడూ పరమేశ్వరుడి అధీనంలోనే ఉంటుంది. పాముకోరలలో ఉన్న విషంవల్ల పాముకు ఎలాంటి హాని జరగదు. కాని పాముచేత కాటు వేయబడిన వారికి మాత్రం హాని జరుగుతుంది. అలాగే పరమేశ్వరుడిని ఆవరించిన మాయవల్ల ఆయనకు ఏ రకమైన హాని జరగదు. నిద్ర పోతున్నప్పుడు కల వస్తుంది. అందులో రకరకాల విషయాలు అనుభవంలోకి వస్తాయి. కాని నిద్రలేచిన తరువాత అదంతా కల, భ్రాంతి అని తెలుస్తుంది. అదే విధంగా కంటికి కనిపించే జగత్తంతా భ్రమ అని తెలుసుకోగలిగితే మాయ తొలగిపోతుంది. మాయ విడిపోతే భగవత్సాక్షాత్కార మవుతుంది. అదే ఆత్మసాక్షాత్కారము.

మాయ రెండు విధాలు

**1. అవిద్యామాయ :** ఇదే అజ్ఞానము. ఇది కామక్రోధలోభ మోహమద మాత్సర్యాలని ఆరు రకాలుగా ఉంటుంది. దీనివల్లనే మానవుడికి నేను నాది అనే అహంకార మమకారాలు ఏర్పడతాయి. ఈ కారణంగానే మానవుడు సంసారానికి బందీ అవుతాడు.

**2. విద్యామాయ :** ఇది భగవంతుని సన్నిధికి తీసుకుపోతుంది. విద్యామాయ వివేకము, వైరాగ్యము అని రెండు రకాలు. దీన్ని ఆశ్రయించిన వారు భగవంతుని శరణు పొందుతారు.

విద్యామాయ వ్యక్తం కాగానే అవిద్యా మాయ తొలగిపోతుంది. మురికిగా ఉన్న నీటిలో సూర్యచంద్రుల ప్రతిబింబం కనిపి చెప్పటానికి బీజాంకుర న్యాయాన్ని ఉదాహరణగా తీసుకున్నాడు శంకరుడు. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ చెబుతున్నాడు. శ్వేతకేతూ! ఎదురుగా మర్రి చెట్టు క్రింద పడిన ఒక మర్రికాయను తీసుకురా ! అన్నాడు. అలాగే వెళ్ళి మర్రికాయను తెచ్చాడు శ్వేతకేతువు. దాన్ని పగలకొట్టు అన్నాడు ఉద్దాలకుడు. పగలకొట్టాడు శ్వేతకేతువు. 'ఏమున్నది దాంట్లో?' అడిగాడు ఉద్దాలకుడు. 'చిన్న చిన్న గింజలు ఉన్నాయి! అన్నాడు శ్వేతకేతువు. 'ఒక గింజను తీసి పగలగొట్టు' అన్నాడు శ్వేతకేతువు. 'ఒక గింజను తీసి పగలగొట్టు' అన్నాడు ఉద్దాలకుడు. మర్రి గింజను పగలకొట్టాడు శ్వేతకేతువు. 'ఏముంది అందులో' అన్నాడు ఉద్దాలకుడు. 'ఏమీలేదు' అన్నాడు శ్వేతకేతువు. అదేమిటి? ఆ గింజనుంచే కదా ఇంత పెద్ద మర్రివృక్షం ఆవిర్భవించింది. మరి అందులో ఏమీ లేకపోవటం ఏమిటి? అడిగాడు ఉద్దాలకుడు.

ఇప్పుడు ఉద్దాలకుడు "నాయనా శ్వేతకేతూ ! ఇంత చిన్నమర్రి విత్తనంలో, అంత పెద్ద మర్రివృక్షం దాగి ఉన్నట్లే, ఈ చరాచర జగత్తంతా పరమేశ్వరునిలోనే దాగి ఉన్నది" అంటాడు.

కాబట్టి జగత్తంతా పరమేశ్వరునిలోనే దాగి ఉంది. ప్రళయం జరిగినప్పుడు ఈ జగత్తంతా పరమేశ్వరునిలో లీనమయింది. ఆ తరువాత కొంత కాలానికి మళ్ళీ సృష్టి ప్రారంభించాలి అనుకున్నాడు పరమేశ్వరుడు. అప్పుడు ముందుగా అవ్యక్తము

తరువాత మహత్తత్త్వము, తరువాత అహంకారము, తన్మాత్రలు, పంచభూతాలు, 84 లక్షల జీవరాశి అంతా ఆవిర్భవించినాయి. సృష్టి ప్రారంభం కాక ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. సృష్టి జరిగిన తరువాత జగత్తు 84 లక్షల జీవరాశితో విలసిల్లుతున్నది. ఈ జీవరాసి యందు అంతటా అంతర్యామిగా పరమేశ్వరుడే ఉన్నాడు. ఈ రకంగా జగత్తే పరమేశ్వరుడు పరమేశ్వరుడే జగత్తు.

ఈ జగత్తు ఎలా ఆవిర్భవించింది అనే మాట చెబుతూ **'బీజాంకుర న్యాయముగా'** అన్నారు. అంటే విత్తనంలోంచి చెట్టు వచ్చినట్లుగా. ఇక్కడ మనం మర్రి గింజను ఉదాహరణగా తీసుకుంటాం. ఎందుకంటే మర్రిచెట్టు చాలా పెద్దది. ఆ వృక్షము ఎంత ప్రదేశము ఆక్రమిస్తుందో మనం ఊహించను కూడాలేము. అంత పెద్ద వృక్షానికి విత్తనం చాలా చిన్నది. అందుకే **విత్తనంబు మర్రి వృక్షంబునకు ఎంత?** అంటారు. ఇంత చిన్నవిత్తనం, అంత పెద్ద వృక్షం ఇంకొకటి లేదు. ఈ కోణం చేతనే మర్రి విత్తనాన్ని ఉదాహరణగా చెప్పటం జరుగుతోంది. ఆ విత్తనం నేలలో పాతిపెట్టి, కొద్దిగా నీరు పోసి తడిపితే కొద్దిరోజుల తరువాత మొలక వస్తుంది. అది క్రమేపీ పెరిగి పెద్దదై శాఖోపశాఖలుగా అభివృద్ధి చెంది చాలా ప్రదేశాన్ని ఆక్రమిస్తుంది. అంత పెద్ద వృక్షం ఇంత చిన్న విత్తనంలో నుంచి వచ్చింది. ఇదే మాటను **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు చెప్పాడు. ఆ విత్తనంలో ఆ చెట్టు యొక్క పూర్తి స్వఊపం దాగి ఉంది. ఇప్పుడు అది బయటకు వచ్చి విస్తరించింది. ఒకవేళ అలా కాకపోతే వేపగింజ నుంచి కూడా మర్రిచెట్టు రావాలి. లేదా రాయి ముక్కను పాతిపెట్టినా మొలక రావాలి. కాని అలారాదు. చెట్లను గురించి చెప్పేటప్పుడు వాటిలో మూడు రకాల భేదాలు ఉన్నాయి అంటారు.

**1. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన చెట్లలో ఒక మర్రిచెట్టుకు ఇంకొక మర్రిచెట్టుకు మధ్య గల తేడాలు.

**2. విజాతీయ భేదము :** ఒక రకమైన చెట్టుకు, ఇంకొక రకమైన చెట్టుకు మధ్య గల తేడాలు. వేపచెట్టుకు మామిడి చెట్టుకు తేడా.

**3. స్వగతభేదము :** ఒకే చెట్టులో ఉండే తేడాలు. కాయలు, కొమ్మలు, రెమ్మలు, కాండము మొ॥

ఒక విత్తనం పాతిపెడితే అది మొలకెత్తి స్వగత భేదంతో బాగా పెద్దదయి కాయలు కాస్తుంది. ఆ కాయల నుంచి విత్తనాలు వస్తాయి. మళ్ళీ అవి మొలకెత్తి చెట్లవుతాయి. ఈ రకంగా చెట్లు తామరతుంపరగా పెరుగుతాయి. అలాగే భ్రమచేత ఆవిర్భవించిన ఈ జగత్తు అనేక రూపాలు కలిగి, అనేకమైన పేర్లతో మొత్తం 84 లక్షల రకాలయిన జీవరాసిగా విస్తరించింది. కేవలము జీవరాసే కాకుండా అడవులు కొండలు ఎడారులు, నదులు, సముద్రాలు, లోయలు, పర్వతాలతో కూడిన జగత్తు విస్తరించింది. ఇక్కడ మనం గ్రహించాల్సింది ఏమంటే వృక్షము పెరిగి పెద్దది కాకముందు సూక్ష్మరూపంలో విత్తనంలో ఎలా దాగి ఉన్నదో, అలాగే ఈ జగత్తంతా సృష్టికి ముందు పరబ్రహ్మలోనే దాగి ఉన్నది. ఇది వివర్త పరిణామము. వివర్తము అంటే ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి కొత్త లక్షణాలు వస్తాయి. పాలు తోడు వేస్తే పెరుగవుతుంది. కాని పెరుగుతో పాలలక్షణాలుండవు. రూపం కూడా ఉండదు.

ఈ రకంగా పరబ్రహ్మ నుంచే జగత్తంతా ఆవిర్భవించింది. ఈ జగత్తంతా మిధ్య భ్రమవల్ల ఆవిర్భవించింది. రజ్జు సర్పభ్రాంతి లాగా.

పూర్వకాలంలో జరిగిన సంఘటన. ఒక బాటసారి పొరుగూరులో పని చూసుకుని ఇంటికి వెడుతున్నాడు. ఇంటికి వెళ్ళే త్రోవలో చిన్న అటవీ ప్రాంతమున్నది. దాన్ని దాటి వెళ్ళాలి. సాయం సమయం అవుతోంది. సూర్యకాంతి క్రమంగా తగ్గిపోతోంది. తాను ఇప్పుడు అటవీ ప్రాంతంలోనే ఉన్నాడు. ఆ ప్రదేశంలో పాములు బాగా ఎక్కువ. భయంకరమైన విషసర్పాలు. సూర్యాస్తమానం తరువాత అని బయటకు వచ్చి ఆహారంకోసం తిరుగుతుంటాయి. వాటి విషం చాలా శక్తిమంతమైనది. క్షణాల్లో ప్రాణాలు తీసేస్తుంది? భయపడుతూనే నడుస్తున్నాడు. త్రోవలో ఎవరూ లేరు. తానొక్కడే ఉన్నాడు. వేగంగా నడుస్తున్నాడు. త్రోవలోనే పాముకంటా పడకూడదని దేవుడికి అనేక నమస్కారాలు చేస్తున్నాడు. అడుగులు తడబడుతున్నాయి భయంతో మొండి ధైర్యంతో నడుస్తున్నాడు. మసకచీకట్లో క్రమ్ముకుంటున్నాయి. ఇంతలో త్రోవకు అడ్డంగా నల్లగా నిగనిగలాడుతున్నది, నాలుగడుగుల పొడవైనది బాటకు అడ్డంగా ఉంది. చూశాడు. పెద్ద పెట్టున అరిచాడు. భయంతో వణికిపోతున్నాడు. వళ్ళు చెమటలు పట్టేస్తోంది. భార్యాపిల్లలు కళ్ళముందు కనిపిస్తున్నారు. గతంలో పాముకాటు వల్ల చనిపోయిన వారందరూ గుర్తుకు వస్తున్నారు. ఏడుపొస్తోంది. తన జీవితం

ఇవాల్టితో ఆఖరు భయం ఇంకా ఎక్కువైంది. పెద్ద పెట్టున అరుస్తున్నాడు. కొంచెం వెనకగా ఇద్దరు వ్యక్తులు వస్తున్నారు. ఈ కేకలు విని పరుగెత్తుకుంటూ వచ్చారు వాళ్ళు తమ దగ్గర ఉన్న దీపం సాయంతో పరికించి చూశారు. పాములో ఏ రకమైన కదలిక లేదు. ఇది చచ్చిన పాము అని నిర్ధారణచేసుకుని, ప్రక్కనే ఉన్న చిన్నకర్ర పుల్లతో పామును జాగ్రత్తగా కదిపారు. అది కదల్లా. దానిలో చలనం లేదు. ఈ విషయం నిశ్చయం చేసుకుని దగ్గరకు వెళ్ళి జాగ్రత్తగా కదిపి చూశారు. అసలది పామే కాదు. అనవసరంగా బాటసారి భయపడ్డాడు. తమనీ భయపెట్టాడు.

ఇప్పుడు చూడండి. బాటసారి అజ్ఞానంతో తాడును చూసి పాము అనుకున్నాడు. దీపపు వెలుగులో జాగ్రత్తగా పరీక్షిస్తే అది పాము కాదు తాడు అని తెలిసింది. మరి ఇందాకటి దాకా అక్కడ అందరినీ భయపెట్టింది. ఇప్పుడు ఆ పాము ఎక్కడికి వెళ్ళింది? పారిపోయిందా, చచ్చిపోయిందా, దేనిలోనయినా కలిసిపోయిందా? ఏమైంది అనే ప్రశ్న వచ్చినప్పుడు ఇప్పటిదాకా కనిపించిన పాము ఎక్కడికీ పోలా. పారిపోలా, చచ్చిపోలా, దేనిలోను లీనమైపోలా మరి ఏమయింది. తన అధిష్ఠానమైన తాడులో కలిసిపోయింది. జ్ఞానము కలగగానే భ్రమ తొలగిపోతుంది. అప్పటిదాకా కంటికి కనిపించిన వస్తువు తన అధిష్ఠానంలో కలిసిపోయింది. ఇదే వివర్త పరిణామము. పాము కనిపించినప్పుడు తాడు ఉండదు. అదే తాడు కనిపించినప్పుడు అక్కడ పాము కనిపించింది. అలాగే అజ్ఞానికి జగత్తు కనిపిస్తుంది. జ్ఞానికి జగత్తంతా పరబ్రహ్మమయము అని తెలుస్తుంది. అందుకే జగత్తంతా మాయచేత కల్పించబడింది.

ఒకసారి భోజమహారాజు సభ తీర్చి ఉన్నాడు. సభలోకి ఒక వ్యక్తి వచ్చి 'ప్రభూ! నేను ఇంద్రజాలీకుడిని. మీరు కొద్ది సమయం కేటాయిస్తే నా ఇంద్రజాలం చూపిస్తాను అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి భోజమహారాజు 'ఇప్పుడు నాకు తీరిక లేదు. ఇంకొకసారి ఎప్పుడైనా నీకు కబురు చేస్తాను. అప్పుడు నీ ఇంద్రజాలాన్ని వీక్షిస్తాను' అన్నాడు. సరేనని వెళ్ళిపోయాడు. ఇంద్రజాలీకుడు. కొద్దిసేపటి తరువాత ఒక బ్రాహ్మణుడు యవ్వనవతి అయిన కన్యతో సహా సభాస్థలికి వచ్చి రాజా ! నేను నా భార్యతో సహ తీర్థయాత్రలకు వెడుతున్నాను. ఈమె నా కుమార్తె. నేను తిరిగి వచ్చేదాకా నీ దగ్గరే ఉంటుంది' అన్నాడు. సరేనన్నాడు మహారాజు. ఆ కన్యను అంతఃపురానికి పంపించాడు. తరువాత బ్రాహ్మణుడు వెళ్ళిపోయాడు. సభ చాలించాడు మహారాజు.

రోజులు గడుస్తున్నాయి. ఒకరోజున అంతఃపుర ప్రాంగణంలో తిరుగుతున్నాడు మహారాజు. ఆయనకు ఒక అందాల సుందరి దర్శనమిచ్చింది. అంతఃపురంలో తనకు తెలియని వారెవరూ? అని విచారించాడు. బ్రాహ్మణుని కుమార్తె. చాలా అందంగా ఉంది. ఆ రోజున తను సరిగ్గా చూడలేదు. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళి తనను పరిచయం చేసుకుని, తనను వివాహం చేసుకోమని కోరాడు. అంగీకరించింది బ్రాహ్మణ్యకన్య. ఆమెను గాంధర్వ వివాహం చేసుకున్నాడు మహారాజు. వారి జీవితం సుఖసంతోషాలతో సాగిపోతోంది. భోజరాజుకు ఆమెయందు నలుగురు పుత్రులు కలిగారు. వారు పెరిగి పెద్దవారవుతున్నారు. రాజుగారు వాళ్ళకి అన్ని రకాల విద్యలు నేర్పించాడు. చాలా గొప్ప వీరులు, పండితులు అని పేరు తెచ్చుకున్నారు. యవ్వనవంతులయ్యారు.

ఒకరోజున సభ తీర్చి ఉన్నాడు మహారాజు. ఇంద్రుని యొక్క దూతవచ్చి రాజుగారికి నమస్కరించి, 'రాజా! దేవదానవ సంగ్రామం భీకరంగా సాగుతోంది. రాక్షసుల ధాటికి దేవతలు నిలువలేకపోతున్నారు. అందుచేత తక్షణమే సహాయంగా నిన్ను బయలుదేరి రమ్మన్నాడు దేవేంద్రుడు' అని చెప్పాడు. ఆ మాటలు విన్న మహారాజు దూతతో 'ప్రస్తుతము నాకు ఇక్కడ పని వత్తిడి ఎక్కువగా ఉంది. అందుచేత నాతో సమానమైన వీరులు నా కుమారులు నలుగురిని ఇంద్రుడికి సాయంగా పంపుతాను తీసుకువెళ్ళు' అన్నాడు. సరేనన్నాడు దేవదూత. రాకుమారులు అమితోత్సాహంతో దేవదూతతో కలిసి యుద్ధానికి బయల్దేరారు.

దేవదానవ సంగ్రామం భీకరంగా సాగుతోంది. ఆకాశంలోంచి రక్తము, మాంస ఖండాలు, శరీర భాగాలు తెగి సభాస్థలిలో పడుతున్నాయి. తన కుమారులు చాలా బాగా యుద్ధం చేస్తున్నారు. అని ఆనందిస్తున్నాడు. ఇంతలో ఒక చెయ్యి తెగిపడింది. అది రాకుమారుడిది అని గుర్తించారు. మహారాణి ఘొల్లున ఏడుస్తోంది. ఇంతలో ఇంకా శరీర భాగాలు, రాకుమారుల తలలు కూడా తెగిపడ్డాయి. నలుగురు కుమారులు యుద్ధంలో మరణించారు. దాంతో రాణికూడా గుండె ఆగి మరణించింది. అంతవరకు ఆనందంగా ఉన్న సభాస్థలి ఒక్కసారిగా శోకసముద్రంగా మారిపోయింది. సభలో అందరూ విచారంగా ఉన్నారు. ఏం చెయ్యాలో ఎవరికీ తెలియటం లేదు. ఈ స్థితిలో బ్రాహ్మణుడు సభలోకి వచ్చాడు. 'రాజా ! తీర్థయాత్రలు పూర్తి చేసుకురావటం కొద్దిగా ఆలస్యమైంది. నా కుమార్తెను పంపిస్తే తగిన వరుణ్ణి చూసి

వివాహం చేస్తాను అన్నాడు. రాజుగారికి ఏమీ పాలుపోలేదు. బ్రాహ్మణుడి కుమార్తె మరణించింది. ఇప్పుడు అతడికి ఏ సమాధానం చెప్పుకోవాలి. ఏమీ తెలియం లేదు. సింహాసనం మించి లేచాడు. బ్రాహ్మణుడి రెండు పాదాలు పట్టుకుని 'నన్ను క్షమించు' అని బిగ్గరగా ఏడుస్తున్నాడు. ఇంతలో ఏవో గట్టిగా అరుపులు వినిపించినాయి. తల ఎత్తి చూశాడు. ఇందాక వచ్చి ఇంద్రజాలికుడు నుంచుని ఉన్నాడు. అతని పాదాలు పట్టుకుని ఉన్నాడు మహారాజు. లేచి చుట్టూ చూశాడు. సభాస్థలి మామూలుగానే ఉన్నది. తన కుమారుల శరీర భాగాలు లేవు. మహారాణి లేదు. అంతా అయోమయంగా ఉంది. ఇప్పుడు నెమ్మదిగా గుర్తు వచ్చింది. ఇంద్రజాలికుడు వచ్చి తన విద్యను ప్రదర్శిస్తాను అన్నాడు. అర్థమయింది మహారాజుకు ఇదంతా అతడు ప్రదర్శించిన ఇంద్రజాలము. 'ఒక్క క్షణంలో ఎంత జరిగిపోయింది' అనుకున్నాడు. ఇలాంటిదే జగత్తు కూడా. అందుకే అంటున్నారు భగవత్పాదుల వారు. **మాయావీవ విజృంభయత్యపి** ఇంద్రజాలికుని గారడీ విద్యలాగా ఈ జగత్తు చిత్రవిచిత్రముగా ఉన్నది.

విద్యారణ్యుల వారు తమ వేదాంతపంచదశిలో చెప్పినట్లుగా "పురుషుని రేతస్సు స్త్రీ గర్భంలో ప్రవేశించి కాళ్ళు, చేతులు, కళ్ళు, ముక్కు, నోరు మొ॥ అవయవాలతో శరీరంగా మారుతుంది. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఇంతకన్న పెద్ద ఇంద్రజాలం ఎక్కడుంది?" అంటారు. భ్రమచేత కల్పించబడిన పాము తాడులో కలిసిపోయినట్లుగా వెండిగిన్నె ముత్యచిప్పలో కలిసిపోయినట్లుగా దొంగవాడు చెట్టు దుంగలో కలిసిపోయినట్లుగా భ్రమ తొలగిపోగానే ఈ జగత్తు బ్రహ్మమునందు లీనమవుతుందని తెలియజేసే గురు దక్షిణామూర్తికి నమస్కారము.

**యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థకం భాసతే**
**సాక్షాత్తత్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్ ।**
**యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తి ర్భవాంభో నిధౌ**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 3**

లోకంలో ఆకాశాది పంచభూతాలు ఉన్నప్పటికీ లేని వాటితో సమానమే. అయినప్పటికీ పంచభూతాల యందు ఆత్మ వ్యాపించి ఉన్నది. అందుచేత అవి ఉన్నట్లుగా అనిపిస్తుంది. సద్గురువు తన దగ్గరకు వచ్చిన శిష్యులకు పరబ్రహ్మతత్వాన్ని

వివరిస్తూ 'తత్త్వమసి' అనే మహావాక్యాన్ని వివరించి అనుభవపూరకంగా జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని చెబుతున్నాడు. ఈ రకంగా ఎవరి స్వరూపం తెలుసుకోవటం చేత మళ్ళీ సంసారలంపటంలోకి రామో,, దాన్ని వివరించి చెప్పే గురుదేవుడైన దక్షిణామూర్తికి నమస్కారము.

ఎవరి స్వరూపం తెలుసుకోవటం వల్ల మళ్ళీ సంసార లంపటంలోకి రామో, ఆ స్వరూపాన్ని వివరించి చెప్పాడు దక్షిణామూర్తి.

సంసారము అనేది పెద్ద ఊబి. ఇందులో దిగినవాడు ఒక కాలుపైకి లాగాలని ప్రయత్నిస్తే, రెండవ కాలు ఇంకా లోపలికి పోతుంది. అంతేగాని మానవుడు అందులోంచి బయట పడటం ఉండదు. ఎద్దును తెచ్చి గానుగకు కడతాం. అది గిరాగిరా అలాగే తిరుగుతూ ఉంటుంది. రోజంతానే కాదు జీవితకాలం అంతా తిరిగినా దాని ప్రయాణం పూర్తికాదు. అది అలానే తిరగాలి. కుడితి తొట్టిలో పడ్డ ఎలక, శ్లేష్మంలో పడ్డ ఈగ, సంసార బంధాల్లో చిక్కుకుపోయిన మానవుడు ఎంత ప్రయత్నించినా దాన్నుంచి బయటకు రాలేడు.

ఒకసారి రాత్రిపూట కృష్ణార్జునులు వెడుతున్నారు. దోవలో ఒక గొప్ప ధనవంతుడి భవనం వచ్చింది. అందులో ఆయన భోజనానికి కూర్చున్నాడు. రకరకాల పిండి వంటలతో భోజనం వడ్డించారు. ఆయన తినబోతున్నాడు. ఇంతలో వాకిట్లో ఒక బిచ్చగాడు గత కొన్నిరోజులుగా ఏమీ తినలేదు. ఆకలితో నకనకలాడుతున్నాడు. వాకిట్లో నుంచుని 'భిక్షాందేహి అమ్మా!' అని అరిచాడు. ఇంటి ఆసామి లోపల నుంచి కసిరాడు. బిక్షాలేదు ఏమీలేదు ఫో ఫో!' అన్నాడు. బిచ్చగాడు వెళ్ళిపోయాడు. ఇదంతా చూసిన పరమాత్మ' నీ సంపద పదిరెట్లు పెరుగును గాక' అని దీవించాడు. అర్జునుడికి ఏమీ అర్థం కాలేదు. అయినా మౌనంగా ఉన్నాడు. వాళ్ళు అలా ఇంకొంత దూరం వెళ్ళేసరికి ఒక పూరిగుడిసె కనిపించింది. అందులో ఒక వృద్ధ బ్రాహ్మణుడు తను ఆహారం తీసుకుని వారం రోజులయింది. ఇవాళ్ళ ఆహారం లభించింది. విస్తరి ముందు కూర్చుని తినబోతున్నాడు. ఇంతలో బైటనుంచి అరుపు. 'అమ్మా! మూడు రోజుల నుంచి ఏమీ తినలేదమ్మా! ఇంత అన్నం ఉంటే పెట్టు తల్లీ !' విన్నాడు బ్రాహ్మణుడు. లేచాడు తనముందున్న విస్తరి తీసుకువచ్చి బిచ్చగాడికి ఇచ్చేశాడు. ఇదంతా చూస్తున్నారు కృష్ణార్జునులు 'రేపటి నుంచి నీకు ఇదికూడా లేకుండా పోవుగాక' అని దీవించాడు పరమాత్ముడు. ఇప్పుడు అర్జునుడికి అనుమానం

వచ్చింది. ఇందాక బిచ్చగాడికి ఏమీ ధర్మం చెయ్యనివాడికేమో సంపద పదిరెట్లు పెరగాలన్నాడు. ఇప్పుడు ఈ పేదబ్రాహ్మణుడికి తినటానికి ఏమీ దొరకదు అని దీవించాడు. ఇదేం విచిత్రం అనుకున్నాడు. అదే మాట అడిగేశాడు శ్రీకృష్ణ పరమాత్మని.

అప్పుడు భగవానుడు చెబుతాడు 'అర్జునా ! ధనవంతుడికి ఇంకా ఇంకా ధనం రావటమంటే ఐహిక వాసనలతో కూరుకుపోతాడు. అతడి ఆశకు అంతముండదు. ఈ పేద బ్రాహ్మణుడి కర్మ పరిపక్వం కాబోతోంది. అంటే అతడు మోక్షానికి అతిదగ్గరగా వచ్చాడు. విషయ వాసనలు లేకపోతే మోక్షప్రాప్తి జరుగుతుంది. అందుకే అలా చేశాను అన్నాడు. పరమాత్ముని గురించి తెలుసుకోవట మంటే మోక్షానికి దగ్గరకు రావటం. జగత్తంతా పరబ్రహ్మము అని తెలుసుకోవటం. సాధకుడికి ఆ విషయాన్నే వివరిస్తాడు దక్షిణామూర్తి. అందుకే ఆ గురుదేవునకు నమస్కారము. ఆకాశాది పంచభూతాలు భౌతికమైన పదార్థాలు. అవన్నీ లేనివాటితో సమానమే. కాని ఆత్మచైతన్యము వాటిలో ఉన్నది కాబట్టి అని ఉన్నట్లుగా కనిపిస్తున్నాయి. ఇక్కడ జాగ్రత్తగా చూడండి. చరాచర జగత్తు ఎలా ఆవిర్భవించింది అంటే–

ప్రళయం జరిగినప్పుడు

| | | |
|---|---|---|
| పృథివి | – | జలంలో కలిసిపోయింది |
| జలం | – | అగ్నిలో కలిసిపోయింది |
| అగ్ని | – | వాయువులో కలిసిపోయింది |
| వాయువు | – | ఆకాశంలో కలిసిపోయింది |
| పంచభూతాలు | – | తన్మాత్రలలో లీనమయినాయి |
| తన్మాత్రలు | – | అహంకారంలో లీనమయినాయి |
| అహంకారం | – | మహత్తత్త్వంలో కలిసిపోయింది |
| మహత్తత్త్వము | – | అవ్యక్తంలో కలిసిపోయింది |

అప్పుడు జగత్తంతా శూన్యంగా ఉంది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు.

ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయమైన జీవులు మోక్షం పొందినాయి. కర్మక్షయం కాని జీవులు తమ కర్మను తమతోపాటు మూట కట్టుకుని పరమాత్మలో

లీనమయినాయి. కొన్నాళ్ళ తరువాత అంటే జీవులతోపాటు వచ్చిన కర్మ పరిపక్వమై అనుభవయోగ్యమయిన తరువాత పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. ఇప్పుడు

పరమేశ్వరుణ్ణించి – అవ్యక్తము వచ్చింది. అదే సత్త్వగుణం. మాయ.

అవ్యక్తం నుంచి – మహత్తత్వం వచ్చింది. ఇది రజోగుణం. హిరణ్యగర్భుడు

మహత్తత్త్వం నుంచి – అహంకారం వచ్చింది. ఇది తమోగుణము, విరాడ్రూపము

అహంకారం నుంచి – పంచతన్మాత్రలు వచ్చినాయి

తన్మాత్రల నుంచి

మొదటగా – ఆకాశం వచ్చింది. దాని లక్షణం **శబ్దం**

ఆకాశం నుంచి – వాయువు వచ్చింది. దీని లక్షణం **స్పర్శ**

వాయువు నుంచి – అగ్ని వచ్చింది. అగ్ని లక్షణము **రూపం**

అగ్ని నుంచి – జలము వచ్చింది. జలము లక్షణము **రసం**

జలము నుంచి – పృథివి ఆవిర్భవించింది. భూమి లక్షణము గంధము

ఈ రకంగా వచ్చిన పంచభూతాలు పంచీకరణ చెందటం వల్ల ఈ జగత్తు ఏర్పడింది. అయితే పంచభూతాలు జడపదార్థాలు. అందుకే అవి ఉన్నా లేనట్లే. అయితే వాటిలో ఆత్మచైతన్యం ఆవరించి ఉన్నది. అందుచేతనే అవి చైత్యవంతము లవుతున్నాయి. **కేనోపనిషత్తు**లో ఒక కథ ఉంది.

ఒకసారి దేవదానవుల యుద్ధం జరిగింది. అందులో దేవతలు విజయం సాధించి విజయోత్సవ సభ జరుపుతున్నారు. అంతలో వారి ఎదురుగా పెద్ద భూతం ప్రత్యక్షమైంది. దాన్ని చూసి దేవతలంతా భయపడ్డారు. ఆ భూతం ఎవరో కనుక్కోమని అగ్నిదేవుని పంపారు. అగ్నిదేవుడు ఆ భూతాన్ని చూశాడు. ఇప్పుడు ఆ భూతం అడుగుతోంది.

భూ : 'ఎవరు నువ్వు'

6. నేను అగ్ని దేవుడను. ఈ జగత్తులో దేన్నయినా క్షణాల్లో దహించి వేస్తాను. అన్నాడు.

భూ - అలా అయితే ఈ గడ్డిపరను దహించు అంటూ ఒక ఎండుగడ్డి పరకను అక్కడ పెట్టింది. దాన్ని దహించటానికి విశ్వప్రయత్నం చేశాడు అగ్ని. అతనివల్ల కాలేదు. తిరిగి వెళ్ళి పోయాడు. ఇప్పుడు దేవతలు వాయువును పంపారు. అతన్ని అడిగింది ఆ భూతం

భూ - నువ్వు ఎవరవు?

వా - నేను వాయుదేవుణ్ణి.

భూ - నీ లక్షణం ఏమిటి? మళ్ళీ అడిగింది.

వా - ఎంతటి వస్తువువైనా తృటిలో ఎగరగొట్టగలను. అన్నాడు వాయువు.

భూ - 'నువ్వంత గొప్పవాడివైతే ఈ గడ్డి పరకను ఎగరగొట్టు' అంటుంది. ప్రయత్నం చేశాడు వాయువు. తన సర్వశక్తులు ధారపోశాడు. అవమానంతో వెళ్ళిపోయాడు.

ఈ కథలోని సారాంశమేమంటే పంచభూతాలయిన అగ్నివాయువు మొదలైన భూతాలకు కూడా ఆత్మచైత్యమున్నది కాబట్టి అవి కూడా చైతన్యములే అని చెప్పాలి. పంచభూతాలు జడాలు కాదు చైతన్యవంతులు. ఇప్పుడు తత్త్వమసి అనే మహావాక్యాన్ని వారికి బోధించి నువ్వే పరబ్రహ్మావు అని చెబుతున్నాడు దక్షిణామూర్తి.

## తత్త్వమసి

వేదాలు నాలుగు. ప్రతి వేదానికి కొన్ని ఉపనిషత్తులు ఉన్నాయి.

| | |
|---|---|
| ఋగ్వేదానికి | 21 |
| యజుర్వేదానికి | 109 |
| సామవేదానికి | 1000 |
| అధర్వణ వేదానికి | 50 |

వెరసి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. మంత్ర యంత్ర తంత్రాలు, సాధన, మోక్షము వీటిలో చెప్పబడ్డాయి. వీటిలో దశోపనిషత్తులు ముఖ్యమైనవి. త్రిమతాచార్యులు వీటికి తమ మతానికి అనుకూలంగా భాష్యం వ్రాశారు.

వీటిలో నాలుగు వేదాలకు సంబంధించిన ఒక్కొక్క ఉపనిషత్తు నుంచి ఒక్కొక్కటి చొప్పున, నాలుగు ఉపనిషత్తుల నుంచి నాలుగు వాక్యాలను తీసుకున్నారు. వీటినే మహావాక్యాలు అంటారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహం బ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్ల యజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణ వేదం |

మహావాక్యాలన్నింటికీ అర్థం ఒకటే. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వీటి మధ్య భేదం లేదు. వీటిలో 'తత్త్వమసి' అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే, మిగిలిన మహావాక్యాలకు కూడా అర్థం తెలుస్తుంది.

**తత్త్వమసి** అనే మహావాక్యం ఛాందోగ్యోపనిషత్తులోది. ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ ఈ వాక్యాన్ని చెబుతాడు. తత్త్వమసి అనే మహావాక్యంలో మూడు పదాలున్నాయి. 1.తత్ 2.త్వం 3.అసి. తత్ అంటే – అది. త్వం అంటే – నీవు. అసి అంటే – అయి ఉన్నావు. అది అంటే పరమాత్మ నువ్వు అంటే – జీవాత్మ. ఓ శ్వేతకేతూ అదే నువ్వు అయి ఉన్నావు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. శ్వేతకేతూ ! నువ్వే పరమాత్మ స్వరూపానివి.

శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో ఉన్న తేజస్సు ఏదయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఆకాశంలో ఉన్న చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. అతనిలో ఉన్న చల్లదనం ఏదైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతిపదార్థంలోను, వస్తువులోను, జీవిలోను ఉన్న ప్రకాశము, శక్తి అన్నీ నీలోనే ఉన్నాయి. **తత్త్వమసి.**

సూర్యకాంతిలో ప్రకాశించే రూపాన్ని కన్ను ఎలా చూడగలుగుతున్నదో, బ్రహ్మ పదార్థముచే ప్రకాశించే జగత్తును మనస్సు ఎలా తెలుసుకుంటుందో, ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులోని అన్ని పదార్థాలకన్న అధికమైనది, త్రికాలములందు ప్రకాశిస్తూ, జగత్తును ప్రకాశింపచేసేది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

దేనిని పొందిన తరువాత ఇంక పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానానికి మించిన జ్ఞానం ఇంకొకటి లేదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాసి. జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

మూడు అవస్థల యందు జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

స్వప్నంలో నేను అని భావించేది, జాగ్రదావస్థలో నేను, నాది అనిపించేది, నేను అంటే ఈ దేహము కాదు అని చెప్పేది, నిర్మలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

శరీరత్రయము, గుణత్రయము, అవస్థాత్రయము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ దేనితోను సంబంధం లేనిదే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

చరాచర జగత్తులో అన్నింటికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆద్యంతములు లేనిది, సర్వవ్యాపి, దేశకాల భేదములు లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

జ్ఞానమే స్వరూపంగా గలది, అహంకారం లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆదిమధ్యాంతములు లేనిది, శాశ్వతమైనది, నిశ్చలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

నువ్వు స్థూలశరీరానివి కాదు, సూక్ష్మశరీరానివి కాదు. కారణ శరీరానివి అంతకన్నా కాదు. నువ్వు సర్వాంతర్యామివి. పంచకోశాలలో ఉన్న జ్ఞానరూపానివి. నీవే పరబ్రహ్మవు. **తత్త్వమసి.**

జనన మరణాలు, కులగోత్రాలు, చతురాశ్రమాలు, చాతుర్వర్ణాలు, ఏవీ లేనిది, సర్వానికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

అజ్ఞానము, జడత్వము, జాగు చెయ్యటము, మూర్ఛ, నిద్ర, భ్రాంతి మొదలైన శరీర ధర్మాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

కర్తృత్వ భోక్తృత్వాలు, అహంకార మమకారాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఏ మాత్రము అజ్ఞానము లేని జ్ఞానరాసియే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

వికారశూన్యుడైన పరబ్రహ్మకు సంసార బంధాలు లేవు. వాటి నుంచి విముక్తి అంతకన్నా లేదు. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులో కనుపించే అన్ని పదార్థాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు, నామరూపాలున్న ప్రతివస్తువు, ప్రతిప్రాణి, ప్రతిఅణువు పరబ్రహ్మమే. అదే నీవు. **తత్త్వమసి.**

వేదం కూడా దృశ్యమానమైనదంతా బ్రహ్మమే అని చెబుతోంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతివస్తువులోను, ప్రతి ప్రాణిలోను ఉన్న శక్తి, ప్రకాశము అంతా నీలోనే ఉన్నది. అదే నీవై ఉన్నావు. చరాచర జగత్తంతా వ్యాపించిన పరబ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

ఈ విషయాలు తెలుసుకుని మనస్సుతో కల్పించబడిన భేదాన్ని నాశనం చేసి బ్రహ్మానందంతో స్వస్వరూపమునందే విహరించవలసింది. భేదాలన్నీ పోయి జగత్స్వరూపంతో ఆత్మయందు బ్రహ్మానందంతో ఉండవలసింది. అని చెప్పాడు ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు. తత్త్వమసి అనే మహా వాక్యానికి అర్థం సద్గురువు ద్వారా చెప్పుకోవాలి. గురుగీతలోని ఈ శ్లోకాలు చూడండి.

**అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

సమస్త చరాచరములందు వ్యాపించి ఉన్న 'తత్' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపచేయు సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్సచరాచరం ।**
**త్వం పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

స్థావర జంగమాత్మకమైన జీవోపాధుల యందు వ్యాపించి ఉన్న 'త్వం' పదమని చెప్పబడుచున్న జీవస్వరూపాన్ని దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం**
**అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

త్రిలోకముల యందు చిద్రూపంగా వ్యాపించిఉన్న చైతన్యాన్ని 'అసి' పదం ద్వారా దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

ఈ రకంగా ప్రత్యగాత్మకు బ్రహ్మమునకు భేదం లేదని సద్గురువు ద్వారా తెలుసుకోవాలి. ఈ రకంగా మహావాక్యార్థాన్ని అనుభవ పూర్వకంగా వివరిస్తున్నారు. దక్షిణామూర్తి. దక్షిణామూర్తి స్తోత్రము యొక్క లక్ష్యము మోక్షసాధన. చతుర్విధ పురుషార్థాలలో నాల్గవది మోక్షం. మిగిలిన మూడు నాల్గవదైన మోక్షం పొందటానికి ఉపకరణాలు. మానవుడి అంతిమ లక్ష్యం మోక్షం.

ముక్తి, మోక్షము, కైవల్యము, పరమపదము అనే పదాలను ఒకే అర్థంలో వాడేస్తున్నారు. ఈ నాలుగు పదాలు ఒకటికాదు. వీటి అర్థాలు వేరు. వీటిలో

**కైవల్యము** అంటే – జీవుడు ప్రకృతి బంధనాల నుండి విడివడి స్వస్వరూపంతో కేవలుడై ఉండటం.

**పరమపదము** అంటే – ఉత్కృష్టమైన పదము చేరటానికి దుర్లభమైన చోటు. అదే బ్రహ్మలోకం. బ్రహ్మం అంటే కర్మబ్రహ్మ. సాధకుడు ఏ దేవతనైతే అర్చిస్తాడో ఆ దేవతే కర్మబ్రహ్మ. ఆయన ఉండేచోటే పరమపదము.

| **మతము** | | **పరమపదము** | | **కర్మబ్రహ్మ** |
|---|---|---|---|---|
| వైష్ణవులకు | – | వైకుంఠము | – | శ్రీమహావిష్ణువు |
| శైవులకు | – | కైలాసము | – | ఈశ్వరుడు |
| శాక్తేయులకు | – | మణిద్వీపము | – | పరాశక్తి |
| వైష్ణవులకు | – | శ్వేతద్వీపము | – | శ్రీమన్నారాయణుడు |
| వైష్ణవులకు | – | గోలోకము | – | శ్రీకృష్ణుడు |

**ముక్తి :** సాకారాన్ని అర్చించే వారు మరణానంతరము పరమపదం చేరతారు. అదే ముక్తి. వారు అంగుష్ఠ మాత్రదేవులై, అక్కడ జరిగే అన్ని ఉత్సవాలు చూసి ఆనందిస్తుంటారు.

**మోక్షము :** శరీరం పతనమైన తరువాత సాధకుడి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇది ప్రయాణం చెయ్యటానికి ప్రత్యేక మార్గం అంటూ ఏమీలేదు. వీరికి పునర్జన్మ ఉండదు. ఇది అద్వైత సిద్ధాంతం. ద్వైతులకు కూడా పునర్జన్మ లేదు అని వారు చెబుతారు.

మొత్తం మీద జీవితం అంతిమలక్ష్యం మోక్షం. కాబట్టి మోక్షసాధనకు అవసరమైన జ్ఞానాన్ని ప్రసాదించే గురువైన దక్షిణామూర్తికి నమస్కారము.

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. బ్రహ్మసత్యం జగన్మిథ్య. అయితే ఈ జగత్తే సత్యము నిత్యము అని అజ్ఞానంతో మానవుడు భావన చేస్తున్నాడు. ఈ అజ్ఞానం ఇవాళ్ళ ఏదో కొత్తగా వచ్చింది కాదు. సృష్టి ప్రారంభం నుంచి ఉన్నది.

ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా మానవ దేహాన్ని సృష్టించిన తరువాత ఆ పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా దేహంలో ప్రవేశించి, దేహంతో తాదాత్మ్యం చెంది, ఇంద్రియాలతో అన్ని రకాల లౌకిక సుఖాలు పొందుతూ తాను పరబ్రహ్మను అనే మాటతో పాటుగా వచ్చి త్రోవకూడా మరిచి పోయాడు. ఇప్పుడు తాను వచ్చిన త్రోవ గుండా అంటే బ్రహ్మరంధ్రం గుండా బయటకు పోతే మోక్షం లభిస్తుంది. కాని శరీరంలోని ఏదో ఒక ఇంద్రియం గుండా బయటకు పోయి పునర్జన్మకు కారణమవుతున్నాడు. అదే బ్రహ్మరంధ్రం గుండా గనక బయటకు పోతే అతడికి పునర్జన్మ ఉండదు. అతడి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. ఇప్పుడు జీవాత్మ పరమాత్మ వేరు వేరా అనే ప్రశ్న వస్తుంది. ఈ రెండూ వేరు కాదు. రెండూ ఒకటే.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిష్వజాతే ।**
**తమోరస్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్యో అభిచాకశీతి ॥**
**సమానేవృక్షే పురుషోనిమగ్నో అనీశయా శోచతి ముహ్యామానః**
**జుష్టం యథాపశ్య త్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః ॥**

సంసారమనే వృక్షం మీద ఒకే రూపము, ఒకే వర్ణము గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు, పండ్లు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా చూస్తూ కూర్చున్నది. కాయలు పండ్లు తింటున్నది జీవాత్మ. అది తింటున్న కాయలు పండ్లు దాని కర్మఫలాలు. అంటే జీవాత్మ తన కర్మఫలితాన్ని అనుభవిస్తున్నది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తున్నది. అది పరమాత్మ. పరమాత్మ ఏ కర్మా చెయ్యదు. కాబట్టి దానికి కర్మఫలాలు ఉండవు. ఈ జీవాత్మ పరమాత్మ రెండూ వేరు వేరా అంటే వేరు కాదు. రెండూ ఒకటే. మన అజ్ఞానం వల్ల అవి రెండూ వేరనిపిస్తున్నది. అజ్ఞానం గనక ఒకసారి పోతే సామాన్యంగా మళ్ళీ రాదు. ఒకవేళ పొరపాటున వచ్చినా, వెంటనే అది నాశనమయి పోతుంది. అజ్ఞానంతో తాడులో పామును చూశాం. అది పాముకాదు తాడు అని తెలుసుకున్నాం. ఇంకొకసారి తాడు కనిపించినా అది పాము అని భ్రమపడం. అలాగే ఎడారిలో ఎండమావులు, ముత్యపుచిప్పలో వెండిగిన్నె, స్థాణువు నందు దొంగవాడు కూడా

వ్యావహారిక సత్యాలయిన దేహము, భార్యాపిల్లలు వీటియందు జ్ఞానము కలిగితే మళ్ళీ అజ్ఞానము రాదు. అది ఎలా అంటే –

1. రాగి చెంబును బంగారంగా చేసిన తరువాత మళ్ళీ అది రాగికాదు.

2. చెట్టు తొడిమ నుంచి కోసిన పండు మళ్ళీ తొడిమకు అతుక్కోదు.

3. కలలో కనిపించినవి నిజంకాదు అని ఒకసారి నమ్మినవాడు మళ్ళీ అని నిజమని నమ్మడు.

ఈ రకంగా అనాదిగా వస్తున్న అజ్ఞానాన్ని పోగొట్టి, జ్ఞానాన్ని ప్రసాదించి ముక్తి మార్గం చూసే గురుదక్షిణామూర్తికి నమస్కారము.

**నానాచ్ఛిద్రఘటోదర స్థిత మహా దీప ప్రభాభాస్వరం**
**జ్ఞానంయస్యతు చక్షురాదికరణ ద్వారా బహిస్స్పందతే ।**
**జానామీతి తమేవ భాంతమను భాత్యేతత్సమస్తం జగత్**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 4**

ఎవరి జ్ఞానము అనేక రంధ్రములు గల కుండలో ఉన్న దీపపు కాంతిలాగా ప్రకాశిస్తూ కన్ను మొదలైన ఇంద్రియాల ద్వారా బయటకు వస్తోందో, కాంతివంతుడైన

అతనినే అనుసరించి ఈ సమస్త జగత్తు 'నేను తెలుసుకొంటున్నాను' అని ప్రకాశిస్తున్నదో అటువంటి గురుస్వరూపుడైన దక్షిణామూర్తికి నమస్కారము.

ఇంట్లో దేవుడి దగ్గర ఒక దీపాన్ని వెలిగించాం. అంటే దీపారాధన చేశాం. గాలికి దీపారాధన కొండెక్కకుండా దానిచుట్టూ ఒక ఆచ్ఛాదన ఏర్పాటు చేస్తాం. సామాన్యంగా బియ్యం వడేసుకునే బుట్ట ఆ దీపారాధన మీద బోలిస్తాం. పూర్వ కాలంలో నా చిన్నప్పుడు కూడా అన్నం వండాలి అంటే ముందుగా పొయ్యిమీద ఎసరుపెట్టి, బియ్యం కడిగి అందులోని నీరు బయటకు పోయేందుకు ప్రత్యేకంగా తయారుచేసిన మేదరబుట్టలో గాని, లేకపోతే, దీనికోసం ప్రత్యేకంగా ఇనప రేకుతో బుట్ట తయారుచేసి దాని నిండా చిల్లులు పొడిచేవారు. కడిగిన బియ్యాన్ని ఆ బుట్టలో పోసి పెట్టేవారు. పోయ్యిమీద ఎసరు కాగేసరికి బియ్యంలో నీరు పూర్తిగా పోయేది. అప్పుడు ఆ బియ్యం ఎసట్లో పోసి, ఉడికిన తరువాత అన్నం వార్చుకునేవారు. అందులో ఎక్కువగా ఉన్న నీరు గంజి రూపంలో బయటకు పోయేది. ఈ బుట్టకు చుట్టుప్రక్కల, క్రిందకూడా పూర్తిగా బిల్లులుంటాయి. దీన్ని దీపంమీద బోర్లిస్తే పైన ఉన్న చిల్లులోంచి పొగ పోతుంది. క్రింది వైపు చిల్లులోంచి దీపం వెలగటానికి అనవసరమైన గాలి వస్తుంది. ప్రస్తుతం దీపారాధనకు చిల్లులతో ఏర్పాటు చేసిన ప్రమిదలు వాడుతున్నారు. ఈ చిల్లుల ద్వారా దీపపు కాంతి ఇల్లంతా ప్రసరిస్తుంది. ఇలా వస్తున్న కాంతిని చూడటము కనుల ద్వారానే జరుగుతుంది. అందుచేత కనులు మొదలైన ఇంద్రియ ద్వారముల నుండి 'నేను తెలుసుకుంటున్నాను' అని ఆత్మయొక్క జ్ఞానము బయటకు ప్రసరిస్తోంది. అలా వెలుగుతున్న ఆత్మని అనుసరించే ఈ జగత్తంతా ప్రకాశిస్తున్నది. అటువంటి జ్ఞానస్వరూపుడైన దక్షిణామూర్తికి నమస్కారము.

ఇక్కడ మనం గుర్తించాల్సింది ఏమంటే అధిష్ఠాన చైతన్య స్వరూపమైన జ్ఞానము మన లోపల బయట అంతటా వ్యాపించి ఉన్నది. మన లోపల ఉన్న అంతఃకరణ కారణంగా జ్ఞానమంతా మనలోనే ఉన్నది. బయట జడపదార్థాలలో లేదు అనుకుంటాం. కాని అధిష్ఠానమైన చైతన్యం జగత్తు అంతటా వ్యాపించి ఉన్నది. **నారాయణ సూక్తంలో**

**యచ్చకించ జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే పివా**
**అంతర్ బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః॥**

బ్రహ్మాండంలో ఈ జగత్తంతా మహదాకాశంలో వేరుగా కనిపించే ఘటాకాశం లాగా ఉన్నది. ఈ జగత్తు లోపలా బయటా అంతా కూడా శ్రీమన్నారాయణుడే వ్యాపించి ఉన్నాడు. ఇక్కడ నారాయణుడు అంటే పరమేశ్వరుడు. నారములు అంటే నీరు అని అర్థం. నీటి యందుంటాడు. కాబట్టి నారాయణుడు అంటారు.

ఇక్కడ శ్రీమన్నారాయణుడు సర్వవ్యాపకుడు. అంటోంది నారాయణ సూక్తం. అలాగే

**సర్వోహ్యేష రుద్రః తస్మై రుద్రాయ నమో అస్తు**

ఈశ్వరుడు కూడా సర్వవ్యాపకుడు.

**అనంత మవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వశంభువం**

అతడు అనంతుడు అచ్యుతుడు సంసార సాగరం నుంచి విముక్తి కలిగించి సుఖాన్నిచ్చేవాడు. అతడు పరమేశ్వర స్వరూపము.

చిల్లుల పాత్రలో దీపం ఉన్నది. ఆ దీపము యొక్క కాంతి చిల్లుల గుండా బయటకు వచ్చి బయట ఉన్న వస్తువులను ప్రకాశింప చేస్తోంది. ఆ వెలుతురులో కన్ను మొదలైన ఇంద్రియాల ద్వారా మనం కొన్ని వస్తువులను కూడా చూడగలుగుతాము. ఈ వెలుతురు ఎంతవరకైతే వ్యాపిస్తుందో అంతవరకు చీకటి కూడా నశిస్తుంది. ఇక్కడ మనం గ్రహించాల్సిన విషయం ఏమంటే, చిల్లుల బుట్టలో ఉన్న దీపం కాని, బయటకు ఉన్న దీపపు కాంతి కాని ఈ రెండూ వేరు వేరు కావు. లోపలున్న దీపం కన్న బయట ఉన్న దీపపుకాంతి వేరుకాదు.

అసలు మనశరీరమే ఒక చిల్లులపాత్ర, శరీరంలోని ఇంద్రియాలన్నీ చిల్లులు కంతల రూపంలోనే ఉంటాయి. ఆ కంతలలో నుంచే శరీరంలో ఉన్న జ్ఞానమనే దీపపు కాంతి బయటకు వచ్చి అన్ని విషయాలను తెలియచేస్తున్నది. దీనిని బట్టి మన లోపల అఖండజ్యోతి రూపమైన జ్ఞానదీపము ఉన్నదని మనకు తెలుస్తోంది. అటువంటి ఆత్మప్రకాశంతోనే జగత్తులోని అన్ని విషయాలు మనం తెలుసు కుంటున్నాము. మనలోనే జ్ఞానదీపము అంటే పరమేశ్వరుడున్నాడు.

**నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా**

**నీవారశూక వత్తన్వీపీతాభాస్వత్యణూపమా**

**తస్యా శ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః**

**సబ్రహ్మ సశివ సహరిశ్చేంద్ర శోక్షర పరమస్వరాట్**

అతడే బ్రహ్మ, అతడే శివుడు, విష్ణువు, ఇంద్రుడు, అక్షస్వరూపుడు నాశనము లేనివాడు. అతని యొక్క కాంతులతోనే జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. ఆ పరమేశ్వరుడు కొన్నికోట్ల సూర్యులకాంతితో చంద్రుల చల్లదనంతో, కొన్ని కోట్ల మెరుపు తీగలు ఒక్కసారిగా ప్రకాశించినట్లుగా ప్రకాశిస్తాడు. అతని నుంచి వచ్చే కోటానుకోట్ల కాంతి కిరణాలలో

**అష్టోత్తరశతం వహ్నే। షోడశోత్తరశతం రవేః**

**షట్త్రింశ తదుత్తరశతం చంద్ర స్వకిరణాశ్శివేః**

అగ్ని 108, సూర్యుడు 116, చంద్రుడు 132 కిరణాలను తీసుకున్నారు. ఈ కాంతుల వల్లనే లోకాలన్నీ ప్రకాశిస్తున్నాయి. బృహదారణ్యకోపనిషత్తులో ఒక కథ ఉంది.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనకుని ఆస్థానానికి వెళ్ళాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు అందించి కుశల ప్రశ్నలు అయిన తరువాత జనక మహారాజు అంటున్నాడు.

"గురుదేవా! నాకు చిన్న అనుమానం వచ్చింది. అది తీర్చి పుణ్యం కట్టుకోండి" అన్నాడు. ఆ మాట వినగానే అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు.

జనకుడు : మహర్షీ ! మానవుడు ఏ వెలుగువల్ల తన నిత్యకృత్యం సాగిస్తున్నాడు.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుని వెలుతురు వల్ల. ఆ వెలుతురు వల్లనే మానవుడు పనిపాటలు నిర్వహించుకుంటాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తి చేసుకొని తిరిగి వస్తాడు. ఆ వెలుగులో వెళ్ళానుకున్నచోటికి వెడతాడు. చేయదలచుకున్న పని చేసుకుంటాడు.

జనకుడు : మహర్షీ ! మరి సూర్యాస్తమయమైతే పనులు ఏ విధంగా జరుగుతాయి.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునియొక్క కాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

జనకుడు : సూర్యచంద్రు లిద్దరూ అస్తమించినప్పుడు ఏం జరుగుతుంది మహాత్మా!

యాజ్ఞవల్క్యుడు : రాజా! సూర్యచంద్రులు ఇద్దరూ లేనప్పుడు అన్ని వ్యవహారాలు దీపం లేదా అగ్ని వెలుగులో జరుగుతాయి.

జనకుడు : మహానుభావా! మరి ఆ అగ్నికుడా లేకపోతే ? సూర్యుడస్త మిస్తాడు. చంద్రకాంతి ఉండదు. అగ్ని ఆరిపోతుంది. అప్పుడు మానవుడు ఏ రకంగా పనులు చేస్తాడు?

యాజ్ఞవల్క్యుడు : రాజా! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే మానవుడు ధ్వని వినిపించిన వైపుకు సాగిపోతాడు.

జనకుడు : మరి ఆ వాక్కు కూడా ఆగిపోతే? అంటే ధ్వనికూడా ఏ మాత్రం వినిపించదు. అప్పుడు ఏం జరుగుతుంది?

యాజ్ఞవల్క్యుడు : జనక మహారాజా! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడుగుతున్నావు. జాగ్రత్తగా విను. ఈ వెలుగులకన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశములకు ప్రకాశం. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు.

జనకుడు : స్వామీ ! ఆత్మ అంటే ఏమిటి? మీరు చెప్పిన శరీరము ఇంద్రియాలు, మనస్సు, ప్రాణాలు. వీటిలో ఆత్మజ్యోతి ఏది?

ఆత్మజ్యోతుల వల్లనే లోకాలన్నీ ప్రకాశిస్తున్నాయి. ప్రవర్తిల్లుతున్నాయి. ఈ రకంగా లోకాలకు జ్ఞానాన్ని ప్రసాదించే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహ మితి భ్రాంతాభృశం వాదినః ।
మాయాశక్తివిలాస కల్పిత మహా వ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 5

స్త్రీలు పిల్లలు గ్రుడ్డివారు తెలివి లేనివారు వీరందరితోను పోల్చదగిన అజ్ఞానులు కొందరు నేను అంటే దేహమని, ప్రాణమని, ఇంద్రియాలని, బుద్ధి అని, శూన్యము అని అనుకుంటున్నారు. వారి యొక్క భ్రాంతిని నశింపచేసి, ఆత్మతత్త్వాన్ని తెలియజేసే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

ఈ శ్లోకంలో ఆత్మతత్త్వాన్ని వివరిస్తున్నారు.

## ఆత్మ

దేన్నిగురించి తెలుసుకున్నంత మాత్రంచేత జగత్తులో ఇంకా తెలుసు కోవలసినది ఏమీఉండదో అదేఆత్మ. దేన్నిగురించి తెలుసుకుంటే జగత్తులో అన్ని విషయాలు అవగతమవుతాయో అదేఆత్మ. ఈ ఆత్మ తనకు తానేసాక్షి. తనకుతానే తెలియ బడుతుంది. అందుచేత ఈ ఆత్మే పరబ్రహ్మ. అంతకుమించినది, వేరైనది ఇంకొకటి లేదు. ఈ ఆత్మపురుషుడే సృష్టిస్థితిలయాలకు కారణమైనవాడు ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు, సత్యము నిత్యము అయినవాడు, సర్వాంతర్యామి. సర్వవ్యాపి. తలవెంట్రుకలో వెయ్యోవంతుగా అణుమాత్రుడై ఉన్నాడు. అతడు జన్మించడు, మరణించడు, శుష్కించడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, భేదింపబడడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతాలను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధుడు. అతనికి కాళ్ళు చేతులు తల మొదలైన అవయవాలు ఏవీలేవు. మమకారము లేనివాడు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు లేనివాడు. కోరికలు లేనివాడు. చింతించటానికి వీలు కానివాడు. రంగు లేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. నిర్వికల్పుడు. రాగద్వేషాలు లేనివాడు. ఆ పరమేశ్వరుడు ఆత్మసంజ్ఞ గలవాడు. శుద్ధుడు. ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైన వారు గాని, అతనికన్న అధికులైన వారు గాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో సమస్త జగత్తులోను

ప్రకాశించేది అతడే. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తోంది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నాలేదు. పరాపరములు లేవు. ఆత్మని పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణము ఏదీలేదు. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, బుద్ధి. ఇవి ఏవీ అవసరంలేదు. నేనే పరమేశ్వరుణ్ణి అనే విజ్ఞానమాత్రం చాలు.

జాగ్రస్వప్నసుషుప్తి మొదలైన అవస్థలలో స్పష్టంగా వ్యక్తమయ్యేది, అంతరంగంలో ఎప్పుడూ నేను నేను అంటూ అనేకవిధాలుగా స్ఫురించేది, సర్వసాక్షిగా ఉండేది, సచ్చిదానందస్వరూపమైనది ఆత్మ. అది మానవుడి హృదయంలోనే ఉంది. అన్నమయకోశం నుంచి ఆనందమయకోశం వరకు గల పరంపరనే 'గుహ' అంటారు. ఆగుహలో ఉన్నాడు కాబట్టే గుహుడు అనబడుతున్నాడు. కుండలో నీరు నిండా ఉంది. ఆ నీటిలో సూర్యుడి ప్రతిబింబం కనిపిస్తోంది. ఆ ప్రతిబింబాన్ని చూసి మూర్ఖుడు అదే సూర్యుడు అనుకుంటాడు. అలాగే భ్రమవలన బుద్ధిలో ప్రతిబింబించిన చిదంశనుచూసి అదే తన సహజరూపం అనుకుంటాడు. వివేకవంతుడు కుండని, నీటిని, ప్రతిబింబాన్ని వదలి స్వయంప్రకాశంగా ఉన్న సూర్యుణ్ణి చూడగలుగుతాడు. అలాగే జ్ఞాని ఈ మూడింటినీ ప్రకాశింపచేసే స్వయంజ్యోతి అయిన పరమసత్యాన్ని స్పష్టంగా చూడగలుగుతాడు. తన హృదయ కమలంలో ఉన్న నిత్యము, సత్యము, శాశ్వతము, సూక్ష్మరూపము అయిన పరమేశ్వరుణ్ణి గుర్తిస్తాడు. ఆత్మ వేరు నేను వేరు అనుకోవటమే బంధం. ఈ రెండూ ఒకటే అనుకోవటమే మోక్షం. ఈ విధంగా జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అని భావనచేసేవాడు, అలా బ్రహ్మాత్వభావన పొందినవాడు తిరిగి ఈ లోకంలో జన్మించడు.

**1. ఏది ఆత్మ ? :** శరీరంలో వివిధ భాగాలున్నాయి. వీటిలో ఆత్మ ఏది ? ఆత్మ అంటే స్థూలశరీరమా ? సూక్ష్మశరీరమా ? కారణశరీరమా? ఏది ఆత్మ ? ఇదిఆత్మ అని చెప్పటానికి ఒక ప్రమాణం అంటూ ఏమైనా ఉన్నదా ? ఇవి మనముందుండే ప్రశ్నలు. వీటికి అనేకమంది అనేకరకాలుగా సమాధానాలు చెప్పారు. అలా అయితే వీటిలో ఆత్మ ఏది ? ఈ విషయాలు చూద్దాం.

**1. చార్వాకులు :** వేదాలు పరమేశ్వరునిచే చెప్పబడలేదు. కొంతమంది స్వార్థపరులు వ్రాసిన అభూతకల్పనలు అని నమ్మేవారు. నాస్తికులు లోకాయతులు, చార్వాకులు మొదలైన వారు కంటికి కనిపించే ప్రత్యక్షప్రమాణాన్ని తప్ప ఇంకేదీ

నమ్మరు. వీరిప్రకారము కూటస్థుడైన చైతన్యం దగ్గరనుంచీ స్థూలశరీరం దాకా సమస్తమూ ఆత్మస్వరూపమే. వీరు వేదాలను నమ్మకపోయినా, ఇతరులను నమ్మించటానికి తమసిద్ధాంతం వేదప్రామాణ్యము అనికూడా చెబుతారు. వీరు **"ఆత్మైవదేవమయః"** అనే విరోచనుని సిద్ధాంతాన్ని ఉదహరించి దేహమే ఆత్మ అని చెబుతారు. ఇది చార్వాకసిద్ధాంతం.

**2. లోకాయతులు :** దేహమేఆత్మ అనేది చార్వాకసిద్ధాంతం. లోకాయతులు ఇంద్రియాలేఆత్మ అని చెబుతారు. స్థూలశరీరం నుంచి ఆత్మ నిష్క్రమించగానే శరీరం మరణిస్తుంది. కాబట్టి ఆత్మఅంటే శరీరంకాదు. దేహం కన్న భిన్నమైన ఇంద్రియాలేఆత్మ. బృహదారణ్యకంలో ఒకసారి ఇంద్రియాలు తమలో ఎవరు గొప్ప అనికలహించుకున్నాయి. అని ఒక కథఉంది. దాన్ని ఉదాహరణగా చూపి, ఇంద్రియాలు కలహించుకున్నాయి అంటే అవి చేతనాలు. కాబట్టి 'ఇంద్రియాలే ఆత్మ' అంటారు.

**3. హిరణ్యగర్భోపాసకులు :** వీరు 'ప్రాణమేఆత్మ' అని నమ్ముతారు. చక్షురాది ఇంద్రియాలు లేకపోయినప్పటికీ, స్థూలదేహం ప్రాణమున్నంత కాలం జీవించి ఉంటుంది కాబట్టి ప్రాణమేఆత్మ అంటారు. దీనికిప్రమాణంగా 'నిద్రపోయే సమయంలో ప్రాణంమాత్రమే మేల్కొనిఉంటుంది. అని, ఇంద్రియాలు తమలో ఎవరు గొప్ప ? అని వాదించుకున్నప్పుడు ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠము అని చెప్పిన శ్రుతివాక్యాలను చూపిస్తారు.

**4. ఉపాసకులు :** వీరు 'మనస్సేఆత్మ' అంటారు. ప్రాణాలకు భోక్తృత్వం లేదు అన్నింటినీ అనుభవించేది మనస్సు. కాబట్టి మనస్సేఆత్మ. మానవుల బంధమోక్షాలకు కారణం మనస్సు. తైత్తిరీయోపనిషత్తులో "ప్రాణమయకోశానికి అభ్యంతరంలో ఉన్న ఆత్మ మనోమయమైనది" అని చెప్పిన వాక్యమే వీరివాదనకు ప్రమాణము.

**5. విజ్ఞానవాదులు :** బౌద్ధులలో అనేక తెగలున్నాయి. క్షణికవిజ్ఞానవాదులైన బౌద్ధులు ప్రతిక్షణం పుడుతూ, చస్తూ ఉండే **'బుద్ధినే ఆత్మ'** అని అంగీకరించారు. మనసుకుండే విజ్ఞానానికి కారణం బుద్ధి. అంటే విజ్ఞానం నుంచే మనస్సు పుడుతోంది. అందుచేత 'బుద్ధే ఆత్మ' అంటారు. జీవాత్మ విజ్ఞానమయకోశంలో ఉంటుంది. జనన మరణాలు, సుఖదుఃఖాలు, ఈ సంసారముఅంతా జీవుడిదే అని ఆగమాలు

చెబుతున్నాయి. అంటూ తైత్తిరీయంలో చెప్పిన "మనోమయకోశానికి భిన్నమై దాని అభ్యంతరంలో ఉండే ఆత్మ విజ్ఞానమయము" అనేమాటను ప్రమాణంగాచూపుతారు.

**6. శూన్యవాదులు :** బౌద్ధంలో శూన్యవాదం ఇంకొకశాఖ. వీరిప్రకారం విజ్ఞానమనేది ప్రతిక్షణము పుడుతూ చస్తూ ఉంటుంది. కాబట్టి విజ్ఞానం ఆత్మ కాదు. అంతకుమించి ఇంకేమీ కనిపించటంలేదు కాబట్టి 'శూన్యమే ఆత్మ' అంటారు. సృష్టికిముందు ఈజగత్తంతా శూన్యంగాఉండేది అనే బృహదారణ్యక, ఛాందోగ్యాలను ప్రమాణంగా చూపుతారు. వేదంలో చెప్పిన 'అసత్' అనే మాటకు శూన్యము అని అర్థంచెబుతారు.

**7. వైదికులు :** వేదాలను ప్రామాణికంగా చెప్పేవారు వైదికులు. వీరి దృష్టిలో వేదాలు పరమేశ్వర ప్రోక్తాలు. వీరిప్రకారము **'ఆనందమయుడే ఆత్మ'.** దీనికి ప్రమాణంగా తైత్తిరీయంలోని "విజ్ఞానమయకోశానికి అభ్యంతరంలో ఆనందమయ కోశమునందున్నది. అదేఆత్మ" అనే వాక్యాన్ని, కఠోపనిషత్తులోని "ముందుగా అసద్రూపమైన జగత్తును తత్త్వరూపంగా తెలుసుకుని, తరువాత ఉపాధిరహితమైన శుద్ధతత్త్వాన్ని తెలుసుకోవాలి" అనే వాక్యాన్ని చూపుతారు. మొత్తం మీద ఆనందమయుడే ఆత్మ అనిచెబుతోంది వైదికదర్శనం.

**2. ఆత్మస్వరూపం :** ఆత్మ ఎలాఉంటుంది ? అనే ప్రశ్నకు సమాధానం లేదు. ఆత్మని చూసిన వాళ్ళెవరూ లేరు. ఆత్మయందు ఈదృక్తము (ఇలా ఉంటుంది) తాదృక్తము (అలా ఉంటుంది) అనేది ఉండదు. ఆత్మస్వరూపాన్ని మనం ఏ విధంగా అంగీకరించినా అది వేద్యమవుతుంది. ఏవిధంగానూ అంగీకరించకపోతే శూన్యమవుతుంది. కాబట్టి ఇలాఉంటుంది, అలాఉంటుంది అని చెప్పటానికి వీలులేనిదే ఆత్మ. కంటికికనిపించే పదార్థాలను ఇలాంటివి (ఈదృక్) అంటారు. కంటికి కనిపించని స్వర్గాదులను వివరించేటప్పుడు అలాంటివి (తాదృక్) అంటారు. ఆత్మ ఇంద్రియాలకు విషయంకాదు. ఇంద్రియాలచేత ఆత్మతెలుసుకోబడదు. అలా అని పరోక్షమైనది కాదు. స్వయంప్రకాశము గలది. **"సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ"**

ఆత్మ సత్యమైనది జ్ఞానస్వరూపమైనది. అనంతమైనది. అపరిచ్ఛిన్నమైనది. ఇవి పరబ్రహ్మ లక్షణాలు. పరబ్రహ్మకీ ఆత్మకీ తేడాలేదు. రెండూ ఒక్కటే. ముందుగా సత్యము అంటే ఏమిటో చూద్దాం. నిషేధించటానికి వీలుకానిదాన్ని, త్రోసి పుచ్చటానికి

వీలులేనిదాన్ని సత్యము అంటారు. బాధితమయ్యేది, త్రోసి పుచ్చటానికి వీలయ్యేది అసత్యం. జగత్తు బాధితమవుతోంది. అందుకే అది అసత్యం. ఆత్మ బాధితం కాదు. అందుకే అది సత్యం. ఇంట్లో ఉన్న వస్తువులన్నింటినీ, కంటికి కనిపించే వాటన్నింటినీ బయట పారేస్తే, ఇక ఇంట్లో మిగిలేది ఆకారం లేని ఆకాశం. అలాగే అనాత్మ పదార్థాలన్నింటినీ నిషేధిస్తే చివరకు వాటికి సాక్షిగా మిగిలేది ఆత్మ. అంటే నిషేధించటానికి వీలుకాని సత్యస్వరూపమే ఆత్మ. సాక్షిరూపంగా ఉండే చైతన్యాన్ని నిషేధించటానికి వీలుండదు అని శ్రుతులు చెబుతున్నాయి. అనాత్మ వస్తువులన్నింటినీ నేతి, నేతి అనేపదాలతో నిషేధిస్తూపోతే, అధిష్ఠాన రూపంలో చివరకి మిగిలేది ఆత్మ. నిషేధించటానికి వీలులేనిది ఆత్మ. అసలు నిషేధించటానికి వీలైనవి ఏమిటి? ఇది అనేరూపంలో, అంటే నామరూపాత్మకంగా ఉండే సమస్తవస్తుజాలాన్ని నిషేధించాలి. ఇదం శబ్దంతో త్యజించటానికి వీలుకానిది, సాక్షిరూపంలో ఉండే ఆత్మ త్యజించటానికి వీలులేనిది, నిషేధించటానికి వీలు లేనిది. అటువంటి బాధారహితమైన సాక్షియే ఆత్మ. అంతేకాని అహంకారము మొదలైన దృశ్యజాతము ఆత్మకాదు.

ఆత్మ అనేది స్వయంగా అనుభూతి రూపం కలది కాబట్టి ఎవరికీ అనుభవింప దగిన విషయంకాదు. ఆత్మ సత్యజ్ఞాన స్వరూపం కలదికాబట్టి ఎవరికీ అనుభావ్య విషయం కాదు. స్వయంప్రకాశము కాబట్టి, జ్ఞాత జ్ఞానము అనేవి లేవు కాబట్టి – జ్ఞానానికి విషయం కాదు. ఆత్మ అనంతమైనది. బ్రహ్మయందు దేశ కాల వస్తుగతమైన పరిమితి ఉండదు. కాబట్టి బ్రహ్మ అనంతము. ముండకోపనిషత్తు చెప్పినట్లుగా బ్రహ్మము నిత్యము, వ్యాపకము, సర్వగతము, మిక్కిలి సూక్ష్మమైనది. బృహదారణ్యకంలో చెప్పినట్లుగా ఈసమస్తమూ ఆత్మయే. కఠోపనిషత్తులో "ఆత్మ ఆకాశంలాగా ఉంటూ అంతటా వ్యాపకమైనది" అని చెప్పబడింది శ్వేతాశ్వతరోప నిషత్తులో "ఆత్మ నిత్యమైన వాటికన్న నిత్యమైనది. చేతనాలన్నిటికన్న చేతనమైనది" అనిచెప్పారు. **సర్వంహ్యేతద్బ్రహ్మ.** ఈ సమస్తమూ బ్రహ్మమే అంటోంది మాండూక్యోప నిషత్తు. ఆత్మ సత్యమైనది అనిచెబుతోంది నృసింహఉత్తరతాపినీ ఉపనిషత్తు.

పరిచ్ఛిన్నభావం కారణంగా దేశకాల వస్తువులన్నీ బ్రహ్మంలో మాయద్వారా ఆరోపించబడ్డాయి. అంతేకాని దేశకాలాదులవల్ల కలిగే భేదాలేవీ పరబ్రహ్మలో లేవు.

అటువంటి పరబ్రహ్మ అనంతత్వమే ఆత్మలో కూడా ఉంది. అందుకే ఆత్మ, బ్రహ్మము రెండూఒక్కటే. ఆకాశము అపరిచ్ఛిన్నమయినప్పటికీ, అందులో గంధర్వ నగరాలను ఆరోపించుకున్నట్లుగా, అనంతమైన ఆత్మలో మాయవల్ల ఇవన్నీ కల్పించబడ్డాయి. ఈఆత్మ పంచకోశాలను ఉపాధిగాగ్రహించినప్పుడు జీవుడు, మాయాశక్తిని ఉపాధిగా గ్రహిస్తే ఈశ్వరుడు అవుతాడు. నిజానికి ఈశ్వరత్వం గాని జీవత్వం గాని ఆత్మకు లేవు.

**3. ఆత్మస్వభావము :** దేన్ని గురించి తెలుసుకుంటే మానవుడు బంధం నుంచి విడివడి కైవల్యాన్ని చేరుకుంటాడో, అది పరమాత్మ. అహంకారము యొక్క స్ఫురణకు ఆధారమైన నిత్యసత్యం స్వయంగా ఒకటుంది. ఇది జాగ్రస్వప్న సుషుప్తులనబడే మూడు అవస్థలను సాక్షిగా చూస్తూ ఉంటుంది. కోశము అంటే వర అని అర్థం. శరీరంలో పంచకోశాలున్నాయని చెప్పుకున్నాం. వీటిలో స్థూలశరీరము అనబడే అన్నమయకోశం ఆత్మకాదు. సూక్ష్మశరీరంగా పిలువబడే ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము కూడా ఆత్మకాదు. కారణ శరీరంగా పిలవబడే ఆనందమయకోశం ఆత్మకాదు. పంచకోశాలలో ఏదీఆత్మ కాదు. ఆత్మ స్వయంజ్యోతి. పంచకోశాలకన్న విలక్షణమైనది. జాగ్రస్వప్న సుషుప్త్యాది అవస్థలలో సంభవించిన వాటన్నింటినీ తెలుసుకుంటుంది. మనస్సు ఉండటాన్ని లేకపోవటాన్ని, పనిచెయ్యటాన్ని తెలుసుకుంటుంది. అందుకే ఇది అవస్థాత్రయానికి సాక్షి. సత్స్వరూపం, నిర్వికారం, నిరంజనం, నిత్యానంద స్వరూపం, వివేకవంతులు ఈ ఆత్మ తమలోనే ఉన్నదని గ్రహిస్తారు. ఆత్మ కంటికి కనిపించదు. చెవులకు వినిపించదు. మనస్సుతో దాన్ని తెలుసుకోలేరు. ఇంద్రియాలను సృష్టించింది ఆత్మ. ఇంద్రియాలకు శక్తినిచ్చింది ఆత్మ. అటువంటి ఆత్మను ఇంద్రియాల ద్వారా తెలుసుకోలేరు. అందుకే ఆత్మ ఉన్నచోటికి ఇంద్రియాలు వెళ్ళలేవు. ఆత్మ అన్నింటినీ చూస్తూఉంటుంది. కాని ఎవరికీ కనపడదు. ఎవరూ దీన్ని చూడలేరు. బుద్ధి మొదలైన వాటన్నింటినీ ఆత్మే ప్రకాశింపచేస్తుంది. ఆత్మ స్వయంప్రకాశి. అన్నింటికీ ప్రకాశాన్నిచ్చేది ఆత్మ. కాని ఆత్మని ఏవీ ప్రకాశింపచేయలేవు. ఆత్మ ఆకాశంలాగా సర్వవ్యాపి. జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఇక్కడ ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాన్ని వివరించటానికి ఆకాశంతో పోల్చిచెప్పారు. అంతమాత్రంచేత ఆత్మ, ఆకాశము

రెండూ ఒకటి కాదు. ఆత్మ దూరంగా ఉంటుంది, దగ్గరగా ఉంటుంది. దూరంగా ఉంటుంది అంటే అజ్ఞానులకు దూరంగా, పొందరానిదిగా ఉంటుంది. జ్ఞానులకు దగ్గరగా ఉంటుంది. వాళ్ళు ఆత్మతత్త్వాన్ని తెలుసుకుని ఉంటారు. శరీరంలో ఇంద్రియాలన్నింటికీ యజమాని ఆత్మ. అలాగే జగత్తులో అన్నింటికీ యజమాని ఆత్మ. ఆత్మఉన్నదనే భయంచేతనే సూర్యుడు సవ్యంగా ఉదయము, అస్తమయము చేస్తున్నాడు. అంటే సూర్యగమనం సవ్యంగా జరుగుతోంది. దిక్పాలకులు వారివిధులను నిర్వహిస్తున్నారు. గాలివీస్తోంది. సముద్రం తన చెలియలికట్టను దాటకుండా ఉంది. ఈ రకంగా చరాచర జగత్తును నియంత్రించేది ఆత్మ. ఈ ఆత్మవల్లనే అహంకారము, వస్తువులు, కష్టసుఖాలు, అన్నీ మనకి స్పష్టంగా తెలుస్తున్నాయి. ఆకాశంలో ఉన్న సూర్యుడు తన ప్రకాశంతో ఈ జగత్తును ప్రకాశింపచేస్తున్నట్లే, ఆత్మ ఈ శరీరంలో అవ్యక్తమైన గుహలో ఉండి శరీరాన్ని ప్రకాశింపచేస్తున్నది. బాగా కాల్చిన ఇనుపముద్దలో ప్రతిఅణువులోనూ అగ్నిస్ఫుటంగా ప్రకాశిస్తూ ఉంటుంది. అలాగే ఆత్మకూడా శరీరము, మనస్సు, ప్రాణాలు, ఇంద్రియాలు చేసే పనులన్నింటితోను తనకు భాగము ఉన్నట్లుగా కనిపిస్తుంది. కాని నిజానికి ఆత్మకు కర్తృత్వము, భోక్తృత్వము రెండూలేవు. ఆత్మకి పుట్టటము, పెరగటము, క్షీణించటము లాంటి షడ్విధ వికారాలు లేవు. ఆత్మనిత్యము, సత్యము, శాశ్వతము అయినది. ఆత్మ ఎటువంటిమార్పులు పొందదు. శరీరం నశించినా ఆత్మనశించదు. అన్నింటికీ ఆధారం ఆత్మ. కాని ఆత్మకు ఏ ఆధారము లేదు. అన్నింటికీ మూలం ఆత్మ. అటువంటిఆత్మకు మూలం ఆత్మేగాని ఇంకేదీ కాదు.

**4. ఆత్మ పరిమాణం :** ఆత్మ పరిమాణం ఎంత ? అనే దానిలో కూడా భిన్నవాదనలున్నాయి. ఇది అణుపరిమాణమని, మధ్యమమని, మహత్పరిమాణమని రకరకాలుగా చెబుతారు. ఈ వాదనలకు శ్రుతులు, యుక్తి, అనుమాన ప్రమాణాలే ఆధారం.

**1. అణు పరిమాణం :** రామానుజ, మధ్వమతస్థులు అంటే ద్వైతులు, విశిష్టాద్వైతులు ఆత్మ అణుపరిమాణంలో ఉన్నది అంటారు. శ్వేతాశ్వరోపనిషత్తులో **వాలగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ** "ఆత్మ అనేది అత్యంత సూక్ష్మమైన నాడులలో, వెంట్రుకలో వెయ్యోవంతు గల నాడుల్లో సంచరిస్తుండటంవల్ల, దానిపరిమాణము

అణువులాగా చాలాచిన్నది'' అంటారు. ఈ ఆత్మ అణువుకన్న చిన్నది. ముండకోపనిషత్తులో చెప్పినట్లుగా **"సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం"** ప్రత్యగ్రూపమైన జీవాత్మ మిక్కిలి సూక్ష్మమైనదై, ఇంద్రియాలకు కనిపించదు. అందుచేత కేవలము విశుద్ధమైన జ్ఞానంతోనే దీన్ని తెలుసుకోవాలి. ఇది అత్యంత సూక్ష్మము, నిత్యము. తలవెంట్రుక చివరను నూరు భాగాలుగా చేసి, అందులో ఒక భాగాన్ని మళ్ళీ నూరు భాగాలుగా చేస్తే ఎంతసూక్ష్మమవుతుందో, అంతసూక్ష్మమైనది.

**2. మధ్యపరిమాణం :** జైనులలో దిగంబరశాఖ వారు "శరీరంలో నఖశిఖ పర్యంతము చైతన్యం ఉంది. కాబట్టి ఆత్మ శరీరమంతావ్యాపించి మధ్యపరిమాణంతో ఉంది. అంటారు. "దీనికి ప్రమాణం బృహదారణ్యకోపనిషత్తు". "ఈ పురుషుడు నఖశిఖ పర్యంతము ప్రవేశించి ఉన్నాడు" రెండు చేతులు ఉన్న చొక్కాలో శరీరమంతా ప్రవేశిస్తున్నట్లే, సూక్ష్మావయవనాడుల్లో ఆత్మ ప్రవేశించి సంచరిస్తోంది. అవయవాల ఉత్పత్తినిబట్టి ఆత్మకు నియతమైన మధ్యపరిమాణం ఉంది. అందువల్ల శరీరం చిన్నదైనా, పెద్దదైనా అంటే చీమలో గాని, ఏనుగులో గాని తేలికగా ప్రవేశిస్తుంది. వీరు చెప్పేదాన్నిబట్టి ఆత్మ అవయవాలు కలిగి ఉంటుంది.

అవయవాలు ఉన్న దేనికైనా నాశనముఉంటుంది. కాబట్టి వీరి మతానన్నుసరించి ఆత్మకు నాశనమున్నది. ఆత్మ అనిత్యము.

**3. మహత్పరిమాణము :** ఆత్మ అణుపరిమాణం కాదు. మధ్యమ పరిమాణం కాదు. అంటే మహత్పరిమాణం గలది అని భావించాలి. ఇది ఆకాశంలో సర్వగతమైనది. నిత్యమైనది. అవయవాలు లేనిది.

ఐతే, వేదాంతదర్శనం ప్రకారం ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మమైనది. **"అణోరణీయాం, మహతోమహీయాం"** మహత్తులకు కూడా మహత్తైనది. అంటే చిన్న వాటికన్న చిన్నది పెద్దవాటికన్నపెద్దది. అణువురూపంలో ఉంటుంది. అదే విస్తరించి జగత్తంతా వ్యాపిస్తుంది. కాబట్టి ఆత్మపరిమాణం ఎంత ? అంటే అణువుకన్న చిన్నది. మహత్తులకన్న మహత్తైనది.

**5. ఆత్మలో రకాలు :** ఆత్మ మూడురకాలుగా ఉంటుంది. 1. గౌణాత్మ 2. మిథ్యాత్మ 3. ముఖ్యాత్మ.

ఆత్మ, ఆత్మకన్న భిన్నమైన వస్తువులు అని రెండు రకాలుగా ఉంటాయి. ఇందులో ఆత్మకన్న భిన్నమైన వస్తువులు మళ్ళీ మూడురకాలు. ఇలా ఆత్మలోగలరకాలను 'ఆత్మానందము' అనే చోట వివరించాం. కాని పాఠకుల సౌలభ్యం కోసం ఇక్కడ కూడా చెబుతున్నాం.

ఆత్మ మూడు రకాలుగా ఉంటుంది. 1. గౌణాత్మ 2. మిథ్యాత్మ 3. ముఖ్యాత్మ. సందర్భాన్నిబట్టి అర్థంగ్రహించాలి. ఇందులో పుత్రాదులు గౌణాత్మ. గౌణము అంటే అప్రధానము అని అర్థం. చీకట్లో స్థాణువుని చూసి దొంగవాడు అనుకున్నాం. ఇక్కడ రాతికున్న చోరరూపం మిథ్య. వెలుతురు ప్రకాశించగానే చీకట్లు తొలగిపోతాయి. పంచకోశాలకున్న సాక్షిరూపత్వం – మిథ్య. పంచకోశాలు మిథ్యాత్మలు. సాక్షిఅయిన ఆత్మకు దేనిలోనూ భేదంలేదు. అందరిలోనూ ప్రతీతమవుతూ ఉంటుంది కాబట్టి సాక్షినే **ముఖ్యాత్మ** అంటారు. అయితే. ఏ వ్యవహారంలో ఏ రకమైన ఆత్మ అవసర మవుతుందో అదే ముఖ్యాత్మ. మిగిలిన రెండూ గౌణాత్మలు.

చనిపోయిన వాడి ఆస్తిపాస్తులు రక్షించేది కుమారుడే. అందుకే పుత్రుడు ఇక్కడ ముఖ్యాత్మ కాగా మిగిలిన రెండూ గౌణాత్మలవుతాయి. 'నేను చిక్కిపోయాను' అన్నప్పుడు చిక్కిపోయేది. సన్నబడేది శరీరము అంతేకాని పుత్రుడు కాదు. అందుచేత ఇక్కడ మిథ్యాత్మే ప్రాధాన్యత సంతరించుకుంటుంది నేను మోక్షంపొందుతాను అన్నప్పుడు నేను అనేపదానికి అర్థం చిదాత్మయైన ముఖ్యాత్మే అని గ్రహించాలి. ఇలా ఏచోట, ఏఆత్మ, ఏ వ్యవహారానికి ఉపయోగిస్తుందో, ఆ సమయంలోనే దాన్ని ఉపయోగించాలి. ముఖ్యాత్మ మీద నిరతిశయమైన ప్రీతి ఉంటుంది. మిగిలిన వాటియందు ఈరకమైన ప్రీతిఉండదు.

1. ఆత్మ 2. ఆత్మకన్న భిన్నమైన వస్తువులు అని రెండు రకాలుగా ఉంటాయి. ఆత్మకన్న భిన్నమైన వస్తువులు మళ్ళీ మూడు రకాలుగా ఉంటాయి. ఆ రకంగా మొత్తం నాలుగు రకాలుగా ఉంటాయి. అవి 1. అత్యంత ప్రీతిపాత్రమైన ఆత్మ 2. ప్రియమైన భార్యాపుత్రులు 3. ఉపేక్షించదగిన గడ్డి, రాళ్ళు వంటివి 4. ద్వేషించదగిన పులి వంటివి. ఒకేవస్తువు పరిస్థితులనుబట్టి 1. ప్రియము 2. అప్రియము 3. ఉపేక్షణీయము అవుతుంది. ఉదాహరణకు మనఎదురుగా పెద్దపులి వచ్చింది. అప్పుడు అది తప్పకుండా ద్వేషింపతగినది. 2. అదేపులి మనల్ని ఏమీఅనకుండా

ప్రక్కగా వెళ్ళిపోతోంది. అప్పుడది ఉపేక్షించతగ్గది అవుతుంది. అదేపులి మనపెంపుడు జంతువనుకోండి. అప్పుడది మనకు అత్యంతప్రియమైనది అవుతుంది. ఇలా పరిస్థితినిబట్టి ఒకేవస్తువు ప్రియము. అప్రియము ఉపేక్షించతగినది అవుతుంది. లోకంలో మూడురకాల ధర్మాలున్నాయి. 1. అనుకూలరూపం 2. ప్రతికూల రూపం 3. ఉపేక్షణీయం. వీటిలో అనుకూలము ప్రతికూలము కానటువంటిది ఉపేక్షణీయం. ఆత్మ అత్యంత ప్రియమైనది. మిగిలినవన్నీ ఆత్మకు ఉపకారకాలు కాబట్టి అవి ప్రియమైనవి. అంతే. అందుచేతనే పులి మొదలైన క్రూరజంతువుల్ని ద్వేషించటం. గడ్డి, రాళ్ళు వాటిని ఉపేక్షించటం జరుగుతుంది. ఈ విషయాన్నే యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి వివరించాడు. ఇదే విషయం పురుషవిధ బ్రాహ్మణంలో కూడా వివరించబడింది. ఆత్మ అనే పుత్రుడు మిగతా అన్నింటికన్నా, ధనముకన్నా కూడా అత్యంతప్రియమైనవాడు. అంటే ఆత్మ అనేది అన్నింటికన్నా ఎక్కువ ప్రీతికరమైనది. **ఆత్మావై పుత్రణామాసి** అంటే ఇదీ అర్థం.

**6. ఆత్మఅసంగము :** ఆత్మ అనేది అసంగం. దేనిమీదా ఆసక్తి అనేది ఉండదు. పరమేశ్వర స్వరూపానికి రాగద్వేషాలు ఉండవు. అహంకార మమకారాలు అసలే ఉండవు. దేహేంద్రియాలతో చేసే పనులతో ఆత్మకు కర్తృత్వము భోక్తృత్వము ఉండవు. భ్రమాజన్యమైన బుద్ధితో తాదాత్మ్యంచెంది, ఆ బుద్ధియొక్క పరిమితులన్నింటినీ తనవిగానే భావించి, తానువేరుగా అంటే జీవాత్మగా భావిస్తుంది. ఉపాధి భేదం చేత, ఆ ఉపాధిధర్మాలు తనవిగా భాసిస్తుంది. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత, నవరంధ్రాలు, దశేంద్రియాలతో కూడిన ఈ శరీరంలో నేను ప్రవేశించకపోతేఎలా అనుకుంది. మానవదేహంలో ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. 1. పై నుంచి 2. క్రిందనుంచి. క్రింద నుంచి ప్రవేశించటం సేవకా లక్షణము కాబట్టి, పై నుంచే ప్రవేశించాలనుకుంది. బ్రహ్మరంధ్రం ద్వారా శరీరంలో ప్రవేశించింది. అలా ప్రవేశించి ఇంద్రియాలతో సమస్తసుఖాలు అనుభవిస్తూ, వచ్చినమార్గం మరచిపోయి, పంజరంలో బంధించబడిన పక్షిలాగా, బయటకువెళ్ళేమార్గంతెలియక అలా ఉండిపోయి, అజ్ఞానంతో శరీరంతోచేసే కర్మలకన్నింటికీ తానే కర్తను, భోక్తను అని భావన చేస్తోంది. శరీరంలో నుంచి బయటకు వెళ్ళటము అంటే నవరంధ్రాలలోను ఏ రంధ్రంద్వారా వెళ్ళినా

మళ్ళీజన్మించాల్సిఉంటుంది. వచ్చిన మార్గంగుండా అంటే బ్రహ్మరంధ్రంగుండా బయటకువెడితేనే పునర్జన్మ ఉండదు.

ఈ రకంగా ఆత్మ అసంగమై ఉండి కూడా అజ్ఞానంతో ఈ కర్మ కంతటికీ తానే కర్త, భోక్త అనుకుంటోంది.

**7. అంతర్యామి :** ఆత్మ అంతర్యామి. సర్వాంతర్యామి. ఈ జగత్తులోఉన్న ప్రతి దానియందు అంతర్లీనంగాఉంటూ అన్నింటినీ నడిపిస్తూఉంటుంది. ఈ జగత్తంతా పరమాత్మ స్వరూపమే. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తులో అన్నింటియందు అంతర్యామిగాఉండేది ఆత్మే. ఈ విషయం బృహదారణ్యకోపనిషత్తులోను, సుబాలోపనిషత్తులోను చెప్పబడింది.

ఎవడు భూమిపైనా, భూమిలోపలా కూడా ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ భూమి ఎవరిని ఎరగదో, ఎవరి శరీరమే భూమియో, భూమిలోపలఉంటూ ఆ భూమిని నియంత్రించేవాడు ఎవరో, అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ప్రాణులు అన్నీ భూమిమీద ఉంటాయి. ప్రతిమానవుడి శరీరము భూమే. అవయవాలు భూమే కాని తనలో ఉన్న వాడిని ఈ శరీరము, అవయవాలు ఏవీ ఎరగవు. శరీరాన్ని అవయవాలను నియంత్రించేది లోపల ఉన్న ఆత్మే.

జలంలో ఉన్నాడు. జలం అతన్నెరగదు. జలమే అతని శరీరం. జలంలో ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

ఈ విధంగా పంచభూతాలలో ఉన్నాడు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నదులు, సముద్రాలు, పర్వతాలు, కొండలు, బండలు, పశువులు, పక్షులు, మృగాలు అన్నింటి యందు అంతర్లీనంగా ఉండి, అన్నింటినీ నియంత్రిస్తున్నాడు. కాని అవి ఏవీ అతన్నెరగవు. అతడే వాటిశరీరం. ఈరకంగా వాటన్నింటినీ నియంత్రిస్తున్న అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ఈవిధంగా ఆత్మపురుషుడు చరాచరజగత్తంతా నిండిఉన్నాడు. ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అన్నింటి యందు ఉన్నాడు. అవేవీ అతన్ని ఎరగవు. వాటిల్లోఉంటూనే వాటిని నియంత్రిస్తుంటాడు. అతడేఅంతర్యామి. అతడేఆత్మ.

**8. జ్ఞానస్వరూపం :** ఆత్మఅంటే పరమేశ్వరస్వరూపమే. ఆత్మకు పరమేశ్వరుడికీ ఏరకమైన తేడాలేదు. ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవటము అంటే జ్ఞానసముపార్జన

చెయ్యటమే. జ్ఞానమే ఆత్మస్వరూపము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. సృష్టి స్థితి లయాలకు కారణం ఆ పరమేశ్వరుడే. ఈ జగస్సృష్టి అంతా ఆ పరమేశ్వరుణ్ణించే జరుగుతుంది. తిరిగి అతనిలోనేలీనమవుతుంది. ఈ జగత్తుకు ఆధారమైనవాడు ఆ పరమేశ్వరుడే. ఈ విధంగా పరమేశ్వరుణ్ణి గురించి తెలుసు కోవటమే జ్ఞానము. నేనే ఆ పరమేశ్వర స్వరూపాన్ని అని తెలుసుకున్నవాడు మహాజ్ఞాని.

జగత్తులో నామరూపాలు గలదేదైనాసరే నశించితీరుతుంది. పుట్టిన ప్రతిదీ మరణిస్తుంది. అసలు ఈలోకమే మర్త్యలోకము. మరము అంటే మరణము ధర్మముగా గలది. అందుకే మర్త్యలోకమనబడుతుంది. ఇలా జన్మించినప్రతిజీవి మరణించటం సృష్టి ధర్మం. ఈ విషయం తెలిసినవాణ్ణి దుఃఖం బాధించదు. అతడు నిత్యము శాంతంగా ఉండగలుగుతాడు. దృశ్యమానమైనజగత్తంతా ఈశ్వరనిర్మితము. జగత్తులో ఈశ్వరుడుతప్ప వేరెవరూలేరు. రెండవదిలేదు. ఈ రకమైన నిశ్చయ జ్ఞానం కలిగినట్లైతే సాధకునిలో కోరికలునశించి పరమశాంతుడవుతాడు. ఈ రకమైన జ్ఞానం కలిగినవాడు పూర్ణకాముడు. ఆప్తకాముడు. అతడు దేన్నీ కోరడు. దేనికీ ప్రలోభపడడు. లోకంలో ఎంతటివాడైనా ప్రారబ్ధాన్ని అనుభవించక తప్పదు. తాను చేసిన కర్మఫలం తానే అనుభవించాలి. అందుకే అర్థమైన కాలంలో కర్మఫలంగా కష్టాలు ప్రాప్తిస్తాయి. ఈ విషయం నిశ్చయంగా తెలిసినవాడు రాగద్వేషాలకు, ఉద్రేకాలకు లోనుగాక, నిశ్చలమైన మనస్సుతో వచ్చినకష్టాలు, నష్టాలను స్వీకరించి పరమశాంతంగా ఉంటాడు. ఈ జన్మలో మనం అనుభవించే సుఖదుఃఖాలు, జనన మరణాలు, గతజన్మలలో చేసిన కర్మఫలితాలు. ఈ విషయం తెలిసిన జ్ఞాని లౌకిక విషయాలను, భోగాలను కోరడు. తన బాధ్యతలనుండి, కోరికలనుండి విముక్తుడవుతాడు. అతడు కోరికలులేకుండా నిష్కామ్యకర్మచేస్తాడు. కాబట్టి ఆగామికర్మ అనేది ఉండదు. అసలు దుఃఖం ఎందుకు కలుగుతోంది? అని ఆలోచించగలిగితే ఈ దుఃఖం ఉండదు. తన కోరికలు తీరకపోవటం వల్ల, ఆతృతవల్ల దుఃఖం కలుగుతుంది. జ్ఞానికి ఈ విషయం తెలుసు. అందుకే అతడు ఆతృతను వదిలి శాంతుడై, కోరికలు లేనిస్థితిలో హాయిగాజీవిస్తాడు. దేహమే ఆత్మకాదు. ఈ శరీరం నేనుకాదు. నేను శుద్ధచైతన్య స్వరూపాన్ని అని తెలుసుకున్నవాడు గతాన్నిగురించి గాని, భవిష్యత్తును గురించి గాని ఆలోచించడు. నేను, నాది అనే భావం సృష్టించే పెనుతుఫానులే బంధమోక్షాలు.

అహంకార మమకారాలు నిర్మూలిస్తే మోక్షం కలుగుతుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఉన్నది నేనే. జగత్తులో నేను తప్ప వేరెవరూలేరు. ఇలా అద్వైతభావన కలిగినవాడికి భావోద్రేకాలుండవు. ప్రాప్తించిన వాటినుంచి, ప్రాప్తించని వాటినుంచి విడివడి ముక్తుడవుతాడు. నానాత్త్వంలో మహాద్భుతంగా కనిపించే ఈ జగత్తంతా భ్రమఅనితెలుసుకుని పరమశాంతంగా జీవిస్తాడు.

**ఆనంద నిలయం :** ఆత్మ ఆనందమయమైనది. ఈ జగత్తంతా ఆనందం నుంచే సృష్టించబడుతోంది. ఆనందంతోనే వృద్ధి చెందుతున్నది. మళ్ళీ ఆనందంలోనే లీనమవుతున్నది. అంటే జగత్తంతా ఆత్మనుంచే ఉద్భవించింది. సముద్రంలో తరంగాలు అనేకానేకాలున్నాయి. అవన్నీ కలిసిలేవు. విడివిడిగాఉన్నాయి. అయినప్పటికీ అవన్నీ సముద్రంలో భాగమే. అలాగే జగత్తులో మనమంతా విడివిడిగా కనిపిస్తున్నప్పటికీ, ఆత్మమాత్రమే ఉన్నది. ఈ జీవులన్నీ విడివిడిగా లేవు. అలా ఉన్నట్లుగా కనిపిస్తున్నాయి. అంతేకాని అవి ఆత్మకన్న వేరుకాదు.

అష్టావక్రగీతలో జనకమహారాజు చెబుతున్నాడు "అపారసాగరంలా ఉన్న నాలో జగత్తుఅనే నావ, మనస్సుఅనే వాయువుతో కదలింపబడినదై, కదలాడుతున్నది. అందువల్ల నాకు ఏవిధమైన అశాంతీ లేదు.

మహాసముద్రంలో తరంగాలు ఉవ్వెత్తున లేచిపడుతుంటాయి. అల్లకల్లోలం సృష్టిస్తుంటాయి. అలాగే నాలో ఈ జగత్తు ఆవిర్భవించి, వివిధ రూపాలు ధరించును గాక. దానివల్ల నాకువచ్చేఇబ్బంది లేదు. ఏరకమైన వృద్ధిక్షయాలు నాలో కలగవు. అనంతమైన సాగరంలా ఉన్ననాలో ఊహలతో కల్పించబడిన జగత్తు కనిపిస్తోంది. నేను నిత్యుణ్ణి. శాంతుణ్ణి. నిరాకారుణ్ణి. అలా కనిపించిన జగత్తు వల్ల నాకు ఏరకమైన హానిజరగదు. ఈజ్ఞానంతో నేను నిశ్చలంగా ఆనందంగా ఉన్నాను. ఆత్మఅనేది వస్తువులోలేదు. అలాఅని వస్తువుకూడా ఆత్మలో ఉండజాలదు. ఆత్మ అనంతము, అమలము, అద్వయము, కాబట్టి ఆత్మకు కోరికలు ఉండే ఆస్కారం లేదు. ఇది నిత్యశాంత స్వరూపం' ఈ జ్ఞానంతోనే సదా శాంతంగా ఉన్నాను.

**అహోచిన్మాత్ర మేవాహం ఇంద్రజాలోపమం జగత్ ।**
**అతోమమ కథం కుత్ర హే యో పాథేయకల్పనా ॥**

మహదాశ్చర్యం. మహాద్భుతం. శుద్ధచైతన్యంగా నేను మాత్రమే ఉన్నాను. ఈ జగత్తంతా నాకు గారడీలాగా కనిపిస్తోంది. అందుకే నాలో సంతోషము, విచారము అనేవి లేవు" అంటాడు.

ఈ జగత్తులో ఉన్న ఏ వస్తువూ జ్ఞానిని ఆకర్షించదు. జగత్తంతా ఇంద్రజాలంలా కనిపిస్తుంది. అందుకే జ్ఞాని ఈ జగత్తును వినోదంతో వీక్షిస్తుంటాడు. పరమేశ్వరుడు ఈ జగత్తును తన లీలా వినోదం కోసం సృష్టించాడు అంటారు. ఇది ఆ లీలా వినోదం అనే పదానికి అర్థం. అలాంటప్పుడు ఈ జగసృష్టి ఎందుకు జరుగుతోంది? అంటే కర్మక్షయం కాని జీవులకు కర్మక్షయం చేసి ముక్తిని ప్రసాదించాలనే ఉద్దేశ్యంతో ఈ సృష్టి జరుగుతోంది. ఈ రకంగా ఆత్మ ఆనంద నిలయము. ఆ ఆనందం అనుభవైక వేద్యము. వర్ణనాతీతము.

ఈ రకంగా ఆత్మతత్త్వాన్ని వివరించే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

గ్రహణం వచ్చినప్పుడు రాహువు అడ్డం పడటం వల్ల సూర్యచంద్రులు సరిగా కనిపించరు. ఒకసారి పాక్షికంగా కనిపిస్తారు. ఇంకోసారి సంపూర్ణంగా కనిపించరు. ఇది మనమందరం చూస్తూనే ఉంటాం. దీన్నే పాక్షిక గ్రహణమని, సంపూర్ణ గ్రహణమని అంటారు. ఆ గ్రహణ సమయంలో బింబ ప్రకాశము లేకపోయినా స్వరూపం మాత్రం తెలుస్తూనే ఉంటుంది. అలాగే గాఢనిద్రలో ఇంద్రియాలు తమ ఉనికిని కోల్పోతాయి. నిద్ర లేచిన తరువాత నేను హాయిగా నిద్రించాను అంటాడు. ఇక్కడ హాయి అనేది తెలిసింది అంటే ఆ స్థితిలో కూడా సాక్షియైన వాడు ఉన్నాడు. ఈ రకంగా దేశకాలమానాలకు అతీతంగా సర్వసాక్షిగా ఉండే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

అవస్థలు మూడు 1.జాగ్రదావస్థ 2.స్వప్నావస్థ 3.సుషుప్తి

1. జాగ్రదావస్థ మెలకువగా ఉన్న స్థితి
2. స్వప్నావస్థలు కలలు కనే స్థితి.

**సుషుప్తి :** అంతఃకరణలో చిత్తాహంకారాలను వదలి, మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు, దాన్ని సుషుప్తి అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ వ్యాపార శూన్యమైనప్పుడు నిద్రపోతున్నాడు

అంటారు. ఇదే సుషుప్తి. దీని అభిమాని – ప్రాజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు, పారమార్థికుడు అనబడతాడు. ఇంద్రియ వ్యాపారము నశించిన స్థితే సుషుప్తి. శివసూత్రాలలో దీన్నే మాయ, అజ్ఞానము అన్నారు. ఇక్కడ బాహ్యవస్తుజ్ఞానము ఏమాత్రము ఉండదు. నేను హాయిగా నిద్ర పోయాను. నాకేం తెలియదు అంటాడు. ఇలా అనటం వల్ల అవిద్యా వృత్తులు మూడు ప్రకటింపబడుతున్నాయి. –1. అజ్ఞానము 2.అహంభావము 3. సుఖము. ఈ మూడు అవస్థలు కలిసినదే సుషుప్తి. అదే నిర్వికార స్వరూపస్థితి. దీన్ని "సంప్రసాదావస్థ" అని కూడా అంటారు. మనస్సు బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్య ప్రాణంలో కలిసిపోతాయి. ఈ రకంగా మనస్సు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువ రాగానే తాను సుఖంగా నిద్రించాను అని తెలుస్తోంది. అంటే జ్ఞానము మాత్రమున్నది. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు, సమిష్టిగా ఈశ్వరుడు. నిద్రించినప్పుడు ఏ రకమైన కోరికలు, కలలు కూడా లేని స్థితి. ప్రాజ్ఞుడు సుషుప్తిలో సంచారం చేస్తాడు. ఇక్కడ అతని అనుభవాలన్నీ ఏకమై పోతాయి. చేతనాశక్తి లేదా గ్రహణశక్తి అస్పష్టంగా నిలచిపోతోంది. అతను అసలు చేతనుడా? కాదా? అనే అనుమానం కూడా వస్తుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావన కలుగుతుంది. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తూ "కుమారా! గాఢనిద్రలో ఉన్నప్పుడు ఇతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు నిద్రిస్తున్నాడు అంటారు.

అద్దంలో చూసినప్పుడు మన ప్రతిబింబమే మనకు కనిపిస్తుంది. కాని అద్దం తియ్యగానే మాయమైపోతుంది. మన నిజరూపం మాత్రమే మిగులుతుంది. అదే విధంగా సుషుప్త్యావస్థలో మనస్సు, ఇంద్రియాలు పనిచెయ్యటం మానేస్తాయి. అప్పుడు మిగిలేది ఆత్మ మాత్రమే. ఆ ఆత్మ నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబం లాంటి జీవభావం పోయి ఆత్మభావం మిగులుతుంది. ఆ స్థితిలో ఆత్మను 'స్వపితి' అంటారు. తన ఆత్మ తనలోనే ఉన్నదని, నిద్రిస్తున్నదని అంటారు. ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కొక్కటే మనసులో లీనమై పోతాయి. మనసు ప్రాణంలో లీనమై పోతుంది. అంటే సుషుప్తిలో ప్రాణం ఒక్కటే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల

యొక్క, మనస్సు యొక్క, అలసటను తీరుస్తుంది. మనసుకు బంధన స్థానమైన ప్రాణమే పరదేవత" అంటాడు. అలాగే–బృహదారణ్యకోపనిషత్తులో కాశీ రాజు అజాత శత్రువు, బాలాకి అనే బ్రాహ్మణ బాలుడికి సుషుప్తి గురించి వివరిస్తాడు.

సుషుప్తిలో జీవికి బ్రహ్మ భావన కలుగుతుంది. అప్పుడు అతణ్ణి ప్రాజ్ఞుడు అంటారు. కాని జీవుడు అవిద్యతో కలిసి ఉంటాడు అందుచేత అతడు పరమాత్మ కాదు. అందుకని సుషుప్తి పొందిన జీవుణ్ణి కారణ శరీరమని, తురీయావస్థ పొందిన జీవుణ్ణి మహాకారణశరీరము అంటారు. తురీయం పైన ఉండేది తురీయాతీతము. ఈ స్థితిలో జీవి శివతుల్యుడవుతాడు. ఇక్కడ పూర్ణజీవత్వము, పూర్ణశివత్వాలు వేరుగా లేవు.

**రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదనాత్**
**సన్మాత్రః కరణోప సంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్ ।**
**జాగ్రత్స్వప్నమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 6**

జీవుడు నిద్రిస్తుండగా ఇంద్రియాల విషయాలన్నింటినీ అంటే వాక్కు మొదలైన ప్రాణాల విజ్ఞానాన్ని పూర్తిగా గ్రహించి హృదయాకాశంలో నిద్రిస్తున్నాడు. హృదయాకాశము పరమాత్మ ఉండే చోటు. నిద్రావస్థలో ఉన్నప్పుడు పురుషుడు శరీరము, ఇంద్రియాలను తనలో లీనం చేసుకుంటాడు. ప్రాణాలన్నింటినీ తనలోకి ఆకర్షించుకుంటాడు. వాక్కు, చక్షువు, శ్రోత్రము మొదలైన ఇంద్రియాలు మనస్సుతో సహా లోపలకు ఆకర్షింపబడతాయి. ఆ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం అంతకన్నా ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది.

ఆత్మ స్వప్నావస్థలో ఉన్నప్పుడు దాని కర్మఫలాలు ప్రారంభమవుతాయి. స్వప్నావస్థలో ఆత్మ మహారాజులా ఉంటుంది. గొప్పబ్రాహ్మణునిలా ఉంటుంది. దేవతల్లాగా ఉచ్ఛస్థితి, అసురులలాగా నీచస్థితి పొందుతుంది. రాజుగారు తన దేశంలో స్వేచ్ఛగా తిరిగినట్లు, ఆత్మ స్వప్నంలో ప్రాణాన్ని, ఇంద్రియాలను గ్రహించి, తన దేహంలో యధేచ్ఛగా తిరుగుతుంది. అదే సుషుప్తిలో ఆనందంతో కూడిన స్థితిని పొందుతుంది.

సుషుప్తిలో ద్వైతం ఉండదు. అది అద్వైత స్వరూపం. సుషుప్తి కాలంలో సుషుప్తిని గుర్తించే ఇంద్రియాలేవీ ఉండవు. అవన్నీ తమకు కారణమైన అజ్ఞానంలో లీనమై పోతాయి. ఇతరమైన దృష్టాంతాలు ఏమీ ఉండవు. ఇలా జ్ఞానసాధనాలేవీ లేనప్పుడు కూడా ప్రకాశితమవుతున్నది కాబట్టే సుషుప్తి స్వయంప్రకాశంకలది అంటున్నాం. సుషుప్తిలో సుఖానికి విరోధియైన దుఃఖం ఉండటం లేదు. కాబట్టి మిగిలేది సుఖమే. దుఃఖము లేక అంధత్వము లేనివాడవుతున్నాడు. అంటే దేహాభిమానం కారణంగా కలిగిన అంధత్వం లాంటి దోషాలేవీ సుషుప్తిలో ఉండవు. సుషుప్తిలో గాయం తగిలినవాడు బాధను అనుభవించటం లేదు. రోగిష్టి వాడు కూడా రోగం లేనివాడు గానే ఉంటున్నాడు. ఈ రకంగా సుషుప్తిలో దుఃఖం ఉండదు అని తెలుస్తోంది. సుఖదుఃఖాలు అనుభవ ప్రమాణంచేత తెలియబడతాయి. సుషుప్తిలో కలిగే సుఖం శయ్య మొదలగు సాధనాల వల్ల వచ్చింది కాదు. నిద్రపట్టకముందు వచ్చేది విషయ జన్యమవుతుంది. కాని నిద్రపట్టిన తరువాత వచ్చే సుఖం అలాంటిది కాదు. జగద్వ్యాపారాలతో అలసిపోయిన ఆత్మ మృదువైన పాన్పుమీద విశ్రమించి నప్పుడు, అలసట, దుఃఖాలను పారద్రోలి స్వస్థచిత్తంతో శయ్యాది సుఖాల వల్ల వచ్చే సుఖం అనుభవిస్తోంది. అంతర్ముఖమైన బుద్ధివృత్తిలో తన ఆనందమే ప్రతిబింబ మవుతుంది. అంటే – ఆ విధంగా అంతర్ముఖమైన బుద్ధి వృత్తిలో అద్దంలో ముఖం లాగా స్వస్వరూపభూతమైన ఆనందం ప్రతిబింబిస్తుంది. ఇదే విషయానందము. సుషుప్తిలో సమస్త ప్రపంచము ప్రకృతిలో లీనమైపోతుంది. అప్పుడు జీవుడు తమస్సుచే ఆచరించబడినవాడై సుఖాన్నిపొందుతాడు అని చెబుతోంది అథర్వ వేదంలోని **కైవల్యోపనిషత్తు.** కాబట్టి సుషుప్తిలో సుఖము, అజ్ఞానము రెండూ ఉంటాయి.

ఈ స్థితిలో సాక్షిగా ఉండే పురుషుడే దక్షిణామూర్తి అతనికి నమస్కారము.

**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థా స్వపి**
**వ్యావృత్తా స్వనువర్తమాన మహమిత్యంత స్ఫురంతం సదా ।**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోముద్రయాభద్రయా**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 7**

బాల్యము కౌమారము యవ్వనము, వృద్ధాప్యము అనే దశలు జాగ్రస్వప్న సుపుస్త్యాది అవస్థలు, జరామరణాలు మానవ జీవితంలో ఇవన్నీ ఒకదాని తరువాత

ఒకటి వస్తాయి. వాటన్నింటిలోను 'నేను' అని ఎప్పుడూ లోపల ఏ చైతన్యమైతే ఉంటుందో, అదే సచ్చిదానందమైన ఆత్మ. ఆ ఆత్మపురుషుడు తనను సేవించే భక్తులకు చిన్ముద్రతో ప్రత్యక్షానుభవాన్ని చూపుతున్నాడు. అటువంటి దక్షిణామూర్తికి నమస్కారము.

రకరకాల పూలతో మాలకడతాము. అందులో కొన్ని వందలు, వేల పుష్పాలుంటాయి. కాని వాటన్నింటిని కలిపి కట్టే దారం మాత్రమే ఒక్కటే. అలాగే జీవితంలో వచ్చే నాలుగు అవస్థలు 1.బాల్యావస్థ 2.కౌమారము 3.యౌవనావస్థ 4.వృద్ధాప్యము. ఈ అవస్థలన్నీ ఒకదానికన్న వేరొకటి వేరైనది. అలాగే జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తి. ఇవి కూడా వేరు వేరు అవస్థలు. అయితే మూర్ఛ, మరణము కూడా వీటిలో కలిపి చెబుతారు కొంతమంది. కాని నిజానికి అవి అవస్థలు కావు. వైద్యశాస్త్రరీత్యా శరీర ఋగ్మతలు. అలాగే వినటం, చూడటం, తాగటం, తినటం వంటి సమయాలు వేరు. వాటిని ఆస్వాదించటం వేరు. ఈ దశలన్నీ కూడా మాలలోని పూవులలాగా వేరువేరుగా ఉంటాయి. అయినప్పటికీ బాల్యంలోనే నేను చేసిన పనులివి. కౌమారంలో నేను చదివిన చదువు ఇది. ఆడిన ఆటలు ఇవి. యవ్వనదశలో నేను అనుభవించిన కష్టాలు, సుఖాలు ఇవి. వృద్ధాప్యంలో నేను పడిన కష్టాలు, నాకు వచ్చిన రోగాలు ఇవి. నేను చూస్తున్నాను. ఆ నేనే అంటే ఇందాక చూసిన నేనే తింటున్నాను. తాగుతున్నాను. నిద్ర పోతున్నాను. అని భావన చేస్తున్నాం. ఇక్కడ అన్నిచోట్ల చెప్పే నేను ఒకటే. అన్ని దశలలోను ఆత్మశరీరము ఇంద్రియాల కన్న వేరుగా ఉంటుంది. శరీరాకృతిలో మార్పులు రావచ్చు కాని నేను అనే ఆత్మలో మాత్రం మార్పురాదు.

అటువంటి ఆత్మ అన్నింటియందు చైతన్య రూపంతో ఉంటుంది. ఆత్మతత్త్వము తెలుసుకోవాలంటే గతజన్మలలో చేసిన సుకృతం ఉండాలి. లక్షలకోట్ల జన్మలలో పుణ్యకార్యాలు చేస్తేనే గాని మానవజన్మ రాదు. మానవుడుగా అనేక జన్మలెత్తి మంచి పనులు చేస్తే దైవచింతన, దైవారాధన అబ్బుతాయి. ఈ రకంగా 21 జన్మలలో పుణ్యకార్యాలు చేస్తేనేగాని ఆధ్యాత్మిక వాసన పట్టదు. ఇక ఇందులో పరిపూర్ణుడు కావాలంటే చాలా జన్మలలో సుకృతం చేసి ఉండాలి. అప్పుడే మోక్షమార్గంలోకి వస్తాడు. అటువంటి పుణ్యాత్ములకు జ్ఞానులకు జ్ఞానముద్ర చూపి జీవాత్మ పరమాత్మల ఏకీభావాన్ని వివరించి చెప్పే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

**విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః**
**శిష్యా చార్యతయా తథైవపితృ పుత్రాద్యాత్మనా భేదతః ।**
**స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయా పరిభ్రామితః**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 8**

ఏ పరమాత్మ జాగ్రస్వప్నావస్థల యందు భ్రాంతిచేత యజమాని సేనకుడు, గురువు శిష్యుడు, తండ్రి కొడుకు అనే రూపాలతో జగత్తును తనకన్న వేరుగా చూస్తున్నాడో, అటువంటి గురుస్వరూపుడైన దక్షిణామూర్తికి నమస్కారము.

చరాచర జగత్తంతా పరమాత్మ స్వరూపమే. దృశ్యమానమైన జగత్తంతా భ్రమచేత కల్పించబడినది. దేహాదులు ఆత్మసంబంధాలే గాని ఆత్మకావు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది.

జగత్తులో అనేకమంది జనులున్నారు. వారిలో రాజులు, చక్రవర్తులు, మంత్రులు, సేనాపతులు, యజమాని, సేవకుడు, గురువు, శిష్యుడు, భార్య, భర్త, పిల్లలు అనేకమంది ఉన్నారు. వీరిమధ్య అనేక రకాలైన సంబంధాలున్నాయి. జగత్తంతా ఒకటే అయినప్పుడు ఈ బంధాలు ఎలా ఉన్నాయి. అసలు సంసారమే ఉండదు కదా? అప్పుడు బంధాలు ఉండవు. అంతా ఒకటే అయినప్పుడు జ్ఞానము, అజ్ఞానము ఎలా ఉన్నాయి. చెప్పేవాడు వినేవాడు వేరువేరుగా ఎలా ఉండాలి? జగత్తులో పరమాత్మకన్న వేరుగా ఏమీ ఉండదు కదా? అలాంటప్పుడు గురువు లేడు శిష్యుడులేడు. శాస్త్రం లేదు జ్ఞానం లేదు బంధం లేదు మోక్షం అంతకన్నా లేదు కదా?

నిజమే. చరాచర జగత్తంతా భ్రమచేత కల్పించబడింది. ఇందులో సందేహం లేదు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే అజ్ఞానం ఉన్నంతవరకు ఈ తేడాలుంటాయి. అజ్ఞానం గనక అంతమైపోతే తేడాలుండవు. ఆత్మసాక్షాత్కారము గనక కలిగినట్లైతే మాయ, భ్రాంతి, అజ్ఞానము అన్నీ పూర్తిగా నశిస్తాయి. అప్పుడు మీరు చెప్పినట్లుగా మిగిలేది కేవలము పరమాత్మ స్వరూపం ఒక్కటే. ఈ విషయాన్నే వివరిస్తున్నారిక్కడ. ముందుగా అద్వైతాన్ని చూద్దాం.

# అద్వైతము

న+ద్వైతము - అద్వైతము. ద్వైతము అంటే రెండవది. న అనగా లేనిది. అద్వైతము అంటే రెండవది లేనిది. ఈ చరాచర జగత్తులోనూ రెండవది అంటూ ఏదీలేదు. ఉన్నది ఒక్కటే. అదే పరమేశ్వరస్వరూపము. ఈ జగత్తంతా ఆ పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. పిపీలికాదిబ్రహ్మపర్యంతము జగత్తంతా ఆయన రూపమే. సృష్టి స్థితి లయాలకు కారణం ఆ పరమేశ్వరుడే. పరమేశ్వర స్వరూపం నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో 1. తూర్పు పడమర ఉత్తరం దక్షిణం నాలుగు దిక్కులు మొదటి పాదము 2. భూమి, ఆకాశం సముద్రాలు, నదులు, పర్వతాలు, అన్నీ బ్రహ్మపదార్థంలోని భాగాలే. 3. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు పరబ్రహ్మలోని మూడవభాగము 4. ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రవణంబ్రహ్మ, మనస్సుబ్రహ్మ. ఈ రకంగా చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని చెబుతోంది ఛాందోగ్యోపనిషత్తు. అలాగే మిగిలిన ఉపనిషత్తులు కూడా జగత్తంతా పరబ్రహ్మస్వరూపము అని ఎలుగెత్తిచాటినాయి. అయితే ఆ పరమేశ్వరుడికి రూపం ఉన్నదా ? లేదా ? అన్నదే పెద్ద ప్రశ్న. నిరాకారుడు, నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ అని చెబుతున్నాయి ఉపనిషత్తులు. ఇక్కడ నిరాకారుడు అంటే ఆకారము లేనివాడు అనే కాదు. ఏ ఆకారంలో ఉంటాడో చెప్పలేని వాడు. జగత్తులో ఉన్నవన్నీ ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అన్నీ ఆయన స్వరూపాలే. ఒక వస్తువు అమూల్యమైనది అంటే విలువలేనిది అనిమాత్రమే కాదు. విలువ కట్టలేనిది అనికూడా అర్థం చెప్పుకోవాలి. అలాగే పరమేశ్వర స్వరూపం ఎలా ఉంటుంది? అంటే- కొన్ని కోట్ల సూర్యుల యొక్క కాంతితో, కొన్ని కోట్ల చంద్రుల చల్లదనంతో, కొన్ని కోట్ల విద్యుల్లతలు ఒక్కసారిగా మెరిసినట్లుగా ఉంటుంది ఆ పరమేశ్వర స్వరూపం. దానికి పైన క్రింద అడ్డము లేవు. మొదలు చివర, ఆది అంతము లేవు. దానికి ఒక రూపంలేదు. లింగములేదు. అది పరమేశ్వర స్వరూపము. జన్మమృత్యుజరాదులు లేనిది, ఆద్యంతములు లేనిది, రూపభేదం, లింగభేదం ఏవీ కూడా లేనిది. ఈ జగత్తు అంతా వ్యాపించినది. ఇది నిరాకారము నిర్గుణము అయిన పరమేశ్వర స్వరూపము. ఇక్కడ నిర్గుణము అంటే సత్త్వరజస్తమో గుణాలు ఏవీలేనిది. ఆ మూడుగుణాలకు అతీతమైనది. త్రిగుణాలు ఆ పరమేశ్వరునిలోనే

ఉన్నాయి. కాని ఆయనకు అవేవీ అంటవు. అందుకే పరమేశ్వర స్వరూపము గుణాతీతమైనది. రూపాతీతమైనది. వికారాలు లేనిది. సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఏకముగా ఉన్నది. రెండవదిలేనిది. అదే పరబ్రహ్మస్వరూపము అని చెబుతున్నాయి ఉపనిషత్తులు.

పరమేశ్వరుడు నిరాకారుడు అన్నారు. మరి ఆకారం లేనివాణ్ణి ఉపాసన చెయ్యటం కష్టం కదా ? అనే ప్రశ్న వస్తుంది. అందుకే పరమేశ్వరుడు సాకారుడు కూడా అని చెబుతున్నాయి ఉపనిషత్తులు. ప్రశ్నోపనిషత్తులో ఓంకారమనేది పరబ్రహ్మము, అపరబ్రహ్మము కూడా. పరబ్రహ్మము అంటే సర్వాతీతమైన నిర్గుణబ్రహ్మ. అపరబ్రహ్మము అంటే సాకారము. వ్యక్తరూపం గల హిరణ్యగర్భుడు. అపరబ్రహ్మోపాసనకే అనేక ధ్యానశ్లోకాలు, మంత్రాలు చెప్పబడ్డాయి. నారాయణ అష్టాక్షరీ, ద్వాదశాక్షరి, గోపాలమంత్రం, పంచదశి మహామంత్రం, చండీమంత్రం. ఇలా అనేక రకాలైన మంత్రాలు ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. ఇవన్నీ సాకారబ్రహ్మవే.

సాధకుడికి ఒక్కసారిగా నిరాకారమైన పరబ్రహ్మ అని చెబితే, అతడికి అర్థం కాదు. అందుకే బ్రహ్మసూత్రాలలో కూడా ముందుగా సాకారబ్రహ్మని తెలుసుకుని, ఆ తరువాత నిరాకారం వైపుగా పయనించాలి అని చెప్పబడుతోంది. దీన్నే 'అపవాద పద్ధతి' అంటారు. ఇందులో కొన్ని సంకేతాల ద్వారా పరబ్రహ్మ పరిమిత రూపాన్ని వివరించి, ఆ తరువాత ఇవేవీ బ్రహ్మము కాదు. పరబ్రహ్మ ఉన్న చోటికి ఇంద్రియాలు పోలేవు. ఇంద్రియాల ద్వారా ఆ పరమేశ్వరుని గురించి తెలుసుకోవటం సాధ్యం కాదు. పరమేశ్వరుడు సచ్చిదానందరూపుడు. సత్యములన్నింటికీ పరమసత్యము అతడే అని చెప్పాలి.

పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు? ఇది ఇంకొక ప్రశ్న. ఒకచోట అనేది లేదు. ఆయన అన్నిచోట్ల నిండి ఉంటాడు. ప్రాణమున్నవి, ప్రాణంలేనివి, చలనమున్నవి, చలనం లేనివి. అన్నింటియందు అంతర్యామిగా ఉంటాడు. అలా ఉంటూ, అన్నింటినీ నియంత్రిస్తూ ఉంటాడు. సూర్యుడిలోఉన్నాడు. కాని సూర్యుడు అతన్నెరుగడు. సూర్యుడే అతడిశరీరం. సూర్యునిలో ఉంటూనే సూర్యుణ్ణి నియంత్రిస్తుంటాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ అని చెబుతోంది బృహదారణ్యకోపనిషత్తు. ఈ రకంగా పరమేశ్వరుడు అన్నింటియందూ అంతర్యామిగా ఉంటాడు. ఇదే పరమాత్మ యొక్క నిగూఢతత్త్వం. పరమేశ్వరుడు ఉన్నాడనే భయంతోనే సూర్యచంద్రులు తమ గతులు

తప్పక తిరుగుతున్నారు. గ్రహాలు తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నాయి. జగత్తులో అన్నీ కూడా సవ్యమైన మార్గంలో పయనిస్తున్నాయి.

సాకారబ్రహ్మని ఉపాసన చేసినవారు అంటే యజ్ఞయాగాది క్రతువులు, పూజలు, వ్రతాలు, దానాలు మొదలైనవి చేసినవారు పుణ్యలోకాలకు పోయి, అక్కడ స్వర్గసుఖాలనుభవించి, కర్మఫలశేషం అనుభవించటం కోసం ఈ భూలోకంలో మళ్ళీ జన్మిస్తుంటారు. ఈ రకంగా పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనులందు, పాపకర్మలు చేసినవారు నీచయోనుల యందు, దుర్మార్గమైన పనులు చేసిన వారు క్రిమికీటకాలుగా పుడుతూ, చస్తూ ఉంటారు.

జిజ్ఞాసువు మాత్రమే ఈ జగత్తంతా పరమేశ్వర స్వరూపము అని తెలుసుకోగలుగుతాడు. అలాంటివాడు మాత్రమే ఐహిక బంధనాలను తెంచుకుని, బంధవిముక్తుడై ముక్తి పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు. అతని యొక్క జీవాత్మ, పరమాత్మ ఒకటై పోతాయి. అదే ముక్తి, మోక్షము, సాయుజ్యము, పరమపదము అని చెప్పబడుతుంది. అతనికి కర్మశేషం ఉండదు కాబట్టి పునర్జన్మ ఉండదు. ఈ రకంగా జీవాత్మ పరమాత్మలు ఏకీభావం పొందటమే అద్వైతము. అప్పుడు జగత్తులో ఉండేది పరమేశ్వరస్వరూపం ఒక్కటే. రెండవది ఏదీలేదు. ఇదే అద్వైత సిద్ధాంతము. సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. అంటే జగత్తంతా పరమేశ్వరమయంగా ఉన్నది. ఆ పరమేశ్వర స్వరూపం నుంచే ఈ జగత్తంతా ఆవిర్భవించింది. ప్రళయ కాలంలో మళ్ళీ ఈ జగత్తంతా పరమేశ్వరునిలోనే లీనమయిపోతుంది. కాబట్టి ఎప్పుడూ ఉండేది పరమేశ్వరతత్త్వం ఒక్కటే. అదే నిత్యము సత్యము శాశ్వతము. అదే అద్వైతము.

**ఆత్మతత్త్వము :** అద్వైత సిద్ధాంతంలో ఆత్మను గురించి ఎక్కువ విచారణ చెయ్యబడింది. అద్వైత వేదాంతధ్యేయం ఆత్మనిరూపణ. ఆత్మ–పరమాత్మ రెండూ ఒక్కటే. **"బ్రహ్మసత్యం జగన్మిథ్య"** ఇదే అద్వైత వేదాంతసారం. ఈ సిద్ధాంతం ప్రకారము శరీరం వేరు. ఆత్మ వేరు. దేహమే ఆత్మకాదు. జీవసృష్టి జరిగిన తరువాత ఆ పరమేశ్వరుడు "నేను ఈ దేహంలో లేకపోతే ఎలాగ?" అని ఆలోచించినవాడై బ్రహ్మరంధ్రం గుండా ఈ శరీరంలో ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, నవరంధ్రాలతో కూడిన ఈ దేహంలో ఉంటూ, ఇంద్రియ సుఖాలనుభవిస్తూ, తానే

పరబ్రహ్మననే విషయం, ఈ దేహం నుంచి బయటకు పోయేమార్గం, మరచిపోయాడు. అవసానకాలంలో జీవిప్రాణాలు సాధారణంగా నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రంగుండా బయటకు పోతాయి. అటువంటిజీవి తాను చేసిన కర్మలను బట్టి మరణానంతరము స్వర్గనరకాలు అనుభవించి, కర్మఫలశేషాన్ని అనుభవించటానికి గాను ఈ భూమిమీద జన్మిస్తాడు. కాని అవసానదశలో యోగియొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. ఉత్క్రమించటం అంటే నవరంధ్రాలలోను ఏదో ఒక రంధ్రం గుండా బయటకు పోవటము. యోగియొక్క ప్రాణాలు ఉత్క్రమించవు. వచ్చిన త్రవోనే బయటకు పోతాయి. అంటే బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు పోయి, మొదట సూర్యలోకానికి, అక్కడ నుంచి పగటి దేవత, రాత్రి దేవత, దినదేవత, వారదేవత, పక్షదేవత. ఇలా ఈ దేవతలందరినీ దాటి, సూర్యలోకం, అగ్నిలోకం, వరుణలోకం, అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరి, కల్పాంతం వరకు ఆ కర్మబ్రహ్మతోనే ఉండి, తరువాత కర్మబ్రహ్మతోపాటుగా పరబ్రహ్మలో లీనమవుతాయి. ఈ రకంగా జీవాత్మ పరమాత్మలు ఏకీకృతం చెందుతాయి అని చెబుతోంది "అద్వైతసిద్ధాంతము"

**సాక్షి:** ఆత్మబుద్ధిలో ప్రతిబింబించినప్పుడు అది సాక్షిచైతన్యము అనబడుతుంది. ప్రతి మానవుడిలోను కొన్ని శక్తులుంటాయి. వాటివల్లనే మానవుడు భావోద్రేకాలు పొందుతాడు. విషయాలను ప్రత్యక్షంగా అనుభవిస్తాడు. గతంలో జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకుంటాడు. ఇవి కాక వీటన్నింటినీ చూసే సాక్షీభూతమైన మరోశక్తి ఉందంటాడు శంకరుడు. నిత్యము చైతన్యంగా భావించేదే సాక్షి. ఇది భావాలు వస్తువుల అనుభవంతో ఏర్పడుతుంది. "స్థూలసూక్ష్మ శరీరాలకు ఏది ఆధారభూతమో, వాటి సమస్తమైన కర్మలను ఏదైతే చూస్తుంటుందో, కర్మఫలాలు అంటకుండా ఏదైతే ఉంటుందో అదే సాక్షి" అంటారు విద్యారణ్యులవారు.

**జీవుడు-ఆత్మ:** ఆత్మ సమస్తమైన అనుభవాలకు ఆధారభూతము. అయినప్పటికీ ఆత్మ ఏ రకమైన మార్పు లేక వికారము పొందదు. ఆత్మని గురించి తెలుసుకోవటం దుర్లభం. మనలో ఉండే ఆలోచనలకు, అనుభవాలకు సాక్షి ఆత్మ. తెరలోంచి బొమ్మలు రావు. కాని తెర లేకపోతే బొమ్మలు పడవు. అలాగే సమస్త అనుభూతులకు ఆధారభూతం ఆత్మ. అంత మాత్రం చేత ఇవన్నీ ఆత్మలోంచే వచ్చాయి అనుకోవటం సరికాదు. పదార్థం యొక్క స్వరూపాన్ని మనం సరిగా అర్థం చేసుకోనంత మాత్రం చేత వాటిలో మార్పు ఉంటుంది అనుకోరాదు. అంటే ఆత్మలో ఏ రకమైన మార్పు

ఉండదు. అయితే మార్పు లేదా వికారము లేని ఆత్మ మార్పు ఉన్నట్లుగా ఎందుకు కనిపిస్తుంది? పరమార్థ సత్త అయిన ఆత్మ వ్యవహారిక సత్తగ ఎందుకు గోచరిస్తుంది? శరీరంలో ఆత్మ ప్రతిబింబించినప్పుడు, శరీరానికి ఉండే వ్యావహారిక లక్షణాలు ఆత్మకు వస్తాయి. ఈ విధంగా ఆత్మ మార్పు చెందినట్లు, భిన్న లక్షణాలతో ప్రకాశితమవుతుంది.

జీవుడు పరమార్థతత్త్వం యొక్క ప్రతిబింబం మాత్రమే. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. ఆకాశంలో ఉన్న ఒకే సూర్యుడు, ఈ భూమి మీద అందరికీ ఒక్కొక్కడుగా కనిపిస్తాడు. అలాగే ఉన్నది ఒక్క పరమాత్మే అయినప్పటికీ ఉపాధి భేదం చేత రకరకాలుగా కనిపిస్తాడు. సూర్యుడు ప్రకాశించేటప్పుడు ఆయన కాంతి అడవులు, సముద్రాలు, నదులు, ఎడారులు, కాలువలు, స్వచ్ఛమైన నీరు, మురికి కాల్వలు వీటన్నింటిలోనూ ప్రతిబింబిస్తాడు. అంతమాత్రం చేత ఆయన యొక్క తేజస్సుకు కళంకం ఏ మాత్రం రాదు. అలాగే పరమేశ్వరుడు ఉపాధి భేదం చేత భిన్నరూపాలుగా కనిపిస్తున్నప్పటికీ ఏ వికారము ఉండదు. ఏ విధమైన తేడా లేకుండా పరమాత్మ తత్త్వం జీవరాశిలో ప్రతిబింబిస్తుంది. అవిద్యా వ్యామోహితులమయిన మనం ఆత్మకి భేదాన్ని, అసమానత్వాన్ని అంటగడతాము. ఇదే వ్యామోహం లేదా మాయ అనబడుతుంది.

'ఫేనబుద్బుదతరంగ న్యాయాన్ని' అనుసరించి జీవబ్రహ్మల ఐక్యతను వివరించారు శంకరులు. అసలు ఫేనబుద్బుదము అంటే ఏమిటి? సంస్కృత న్యాయాలలో ఇది ఒకటి. ఫేనము అంటే సముద్రపు నురుగు. బుద్బుదము అంటే బుడగ, నీటిబుడగ. తరంగములు అంటే సముద్రంలో వచ్చే అలలు. సముద్రము అనంతమైన జలరాశి. అయితే సముద్రము అంటే కేవలము నీరే కాదు. ఉవ్వెత్తున లేచే తరంగాలు, నీటిబుడగలు, నురుగు ఇవన్నీ కలిసినదే సముద్రము. తరంగాలు, నీటిబుడగలు సముద్రంకన్న వేరైనవి కావు. అలాగే జగత్తులో 84 లక్షల రకాలైన జీవరాశి, క్రిమికీటకాల నుంచి మానవులదాకా ఉన్న జీవరాశి ఆ పరమేశ్వరుని కన్న వేరు కాదు. మనస్సు, బుద్ధి, అంతఃకరణ అనేవి జీవుడికి విశేషణాలు కావు. ఉపాధులు మాత్రమే. ఒక పదార్థం యొక్క స్వభావాన్ని తెలిపేది విశేషణం. రంగు అనేది వస్తు విశేషణం. శరీరము అనేది ఉపాధి. ఘటాకాశము అన్నప్పుడు, ఘటంలో ఆకాశమున్నది. కాబట్టి ఘటమనేది విశేషణం కాదు. ఉపాధి. ఇక్కడ గుణము

అనేది ఒక పదార్థాన్ని ఆశ్రయించి ఉంటుంది. పదార్థం నుంచి దాన్ని విడదీయలేము. ఒక పదార్థం స్వభావాన్ని తెలిపేది విశేషణం. రంగు అనేది వస్తు విశేషణము. కాని కుండలో ఉన్న ఆకాశం, ఆ కుండ విశేషణం కాదు. అది ఉపాధి. ప్రపంచం గనక ఒక నీడ లాంటిది అయితే ఆ నీడని ప్రసరింపచేసే వాస్తవిక పదార్థమే బ్రహ్మతత్త్వము. ఈ విధంగా ఈశ్వరుడు బింబమైతే, జీవుడు ప్రతిబింబము. ఇలా బింబప్రతిబింబ వాదాన్ని చేస్తూ పరమేశ్వరుడు జీవుడు బింబ ప్రతిబింబాలు అన్నాడు శంకరుడు.

**మాయావాదం :** అనాదియైనది, అంతము గలది, ప్రమాణాలకు అప్రమాణాలకు సాధారణమైనది, సత్తుకాదు, అసత్తు కాదు, సదసత్తు అంతకన్నా కాదు. స్వయంగా అధికమైనది. వికారాలు లేనిది, నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

అద్వైత సిద్ధాంతంలో మాయ, మిథ్య, భ్రాంతి, అవిద్య అనే పదాలు ఎక్కువగా కనిపిస్తాయి. మాయ అంటే ఏమిటి? ఈ మాయకు, పరమేశ్వరుడికి సంబంధం ఏమిటి? ఇటువంటి ప్రశ్నలకు లౌకిక దృష్టిలో తావులేదు. వాటిని పారమార్థిక దృష్టితోనే ఆలోచించాలి అంటాడు శంకరుడు. సమస్త జగత్తుకు మూలం పరమేశ్వరుడే. ప్రపంచం బ్రహ్మనికి బాహ్యంగా లేదు కాబట్టి, ఆ రెండింటి మధ్యనా తాదాత్మ్యమున్నది. ప్రపంచం పొందే విచ్ఛిన్నమంతా బ్రహ్మనికి వర్తించదు. కాబట్టి బ్రహ్మము, ప్రపంచము, ఒక్కటి కాదు. బ్రహ్మము సత్యము. జగత్తు మిథ్య. బ్రహ్మవేత్తకు జగత్తుమిథ్య అనిపిస్తుంది. సామాన్యుడికి జగత్తు అనేక రకాలుగా ఉన్నట్లు కనిపిస్తుంది.

బ్రహ్మము జగత్తుకు మూలమైనప్పటికీ, జగత్తుకు ఆధారమైనప్పటికీ, జగత్తులో ఉండే మార్పులు, నానాత్వము బ్రహ్మనికి వర్తించవు. మాయామయమైన ఈ జగత్తులో అనేక వాదనలున్నాయి. వాటిలో తాడు పాముగా కనిపించటం వివర్తవాదం. పాలు పెరుగుగా మారటం పరిణామవాదం. ఈ విషయాలను శంకరుడు సామాన్య ఉదాహరణలతో వివరించాడు అవి

1. రజ్జుభ్రాంతి – తాడు పాముగా కనిపించటం
2. మరుమరీచికలు – ఎండమావులను చూసి నీటిమడుగు అనుకోవటం
3. శుక్తరజతభ్రాంతి – ముత్యపుచిప్పను చూసి వెండి అనుకోవటం.

ఇక్కడ కారణంలో మార్పు లేదు. కాని ఉన్నట్లు కనిపిస్తుంది. ఉన్నదంతా పరమేశ్వర స్వరూపమే. కాని అది మాయవల్ల విచ్ఛిన్నమైనట్లు కనిపిస్తుంది. ఆ

విచ్ఛన్నశక్తే మాయ. ఆకారం లేనిదాంట్లో ఆకారాన్ని చూపించేదే మాయ. పరమేశ్వరుని మూలశక్తే మాయ. అది సత్తు కాదు. అసత్తు కాదు. మాయకు పరబ్రహ్మకు మధ్య ఉన్న సంబంధమే ఈశ్వరుడు. అంత మాత్రంచేత ఈశ్వరుణ్ణి మాయ బంధిస్తుందని కాదు. ఆయన మాయచేత బాధితుడు కాదు. మాయ ఈశ్వరుని శక్తిని చాటుతుంది. మాయ లేకపోతే ప్రపంచం యొక్క ఉనికిని గురించి తెలుసుకోలేము. జగత్తును బహిర్గతం చేస్తున్నంతవరకు దానికి ఉనికి ఉంటుంది. అది సత్తే. కాని బ్రహ్మ అవగతమైనప్పుడు దానికి ఉనికి లేదు. అప్పుడది అసత్తు. మరొకటి లేనిదయితే ఈ మాయ సదసత్ అవుతుంది. **జగత్తు మిథ్య. జీవుడు-బ్రహ్మ ఒకటే. ఇదే అద్వైతసారం.**

మానవుడు జాగ్రదావస్థలో గాని, స్వప్నావస్థలో గాని మాయతో భ్రమను పొంది మాయాకల్పిత జగత్తును చూస్తున్నాడు. ఈ స్వప్నంగాని, జాగ్రదావస్థ గాని అంతా మాయాకల్పితమే. ఈ మాయను ఎలా దాటవచ్చు? అంటే ఆత్మజ్ఞానము వల్ల చరాచర జగత్తంతా పరమేశ్వర మయము. పరమేశ్వరుని కన్న వేరైనది ఏదీలేదు అనే విషయం తెలిస్తే మాయ తొలగిపోతుంది.

**భూరంభాంస్యనలోనిలోంబర మహర్నాథో హిమాంశుఃపుమాన్**
**నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।**
**నాన్యత్కించ న విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 9**

రెండవ శ్రేణికి చెందిన మధ్యమాధికారులకు అష్టమూర్తులే చరాచర జగత్తుగా కనిపిస్తున్నది. వీరి కోసమే ఉపనిషత్తులలో సగుణోపాసన చెప్పబడింది. ఈ అష్ట మూర్తులు ఎవరికన్న వేరు కావో ఆ గురుస్వరూపమైన దక్షిణామూర్తికి నమస్కారము.

ఈ శ్లోకంలో సగుణోపాసనను వివరిస్తున్నారు. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు సర్వవ్యాపి. సర్వాంతర్యామి. చరాచర జగత్తంతా అతడే ఆక్రమించి ఉన్నాడు. అతన్ని ఉపాసించటం అనేది నిర్గుణోపాసన. ఇందులో దేవతకు ఒక ఆకారం ఉండదు. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఇలా పరమేశ్వరుణ్ణి ఉపాసన చెయ్యటం సాధ్యంకాదు. లక్షమందిలో ఒకరు మాత్రమే ఈ రకమైన ఉపాసన

చేయగలరు. వారినే ఉత్తమాధికారులు అంటారు. లోకంలో రెండవ శ్రేణికి చెందిన మధ్యమాధికారులు ఎక్కువమంది ఉన్నారు. వారికోసమే సగుణోపాసన చెప్పబడింది. దేవాలయంలో శివలింగాన్ని చూపించి ఇది శివుడు. దీన్ని అర్చించు అంటాము. అలాగే సాలగ్రామాన్ని చూపించి ఇది విష్ణు స్వరూపము అర్చించు అంటాం. ఇలా చెబితే ఆ ఆకారంమీద ఉపాసకుడి దృష్టి తేలికగా నిలుస్తుంది. అందుకే సాకారోపాసన చెప్పాయి ఉపనిషత్తులు. వీటిలో శైవ, వైష్ణవ, శాక్తేయోపనిషత్తులు ఉన్నాయి. శైవోపనిషత్తులు ఈశ్వరుడే పరబ్రహ్మ. శివుడికి సంబంధించిన మంత్రాలు, ఉపాసన వీటిలో ఉంటుంది. వైష్ణవోపనిషత్తులలో విష్ణువే పరబ్రహ్మ. విష్ణువుకు సంబంధించిన మంత్రాలు, ఉపాసన విధానము వీటిలో ఉంటుంది. ఇక్కడ శివుడు, విష్ణువు త్రిమూర్తులలోని వారు కారు. వీరు పరబ్రహ్మ స్వరూపులు. శాక్తేయోపనిషత్తులలో పరాశక్తే పరదేవత అంటారు. ఇది శాక్తేయము, శ్రీవిద్య అని రెండు రకాలుగా ఉంటుంది. శాక్తేయంలో శక్తే ప్రధానదేవత. ఆవిడే పరమేశ్వరి. ఇక్కడ శివుడికి ప్రాముఖ్యత లేదు. ఉత్తర భారతంలో ఎక్కువగా శాక్తేయమే ప్రచారంలో ఉంది. వీరికి కాళి, చండిలాంటి ప్రధాన దేవతలు. శ్రీవిద్యలో శివశక్తుల స్వరూపమే పరబ్రహ్మ. లలితా సహస్రంలో చెప్పిన లలితా త్రిపురసుందరి, రాజరాజేశ్వరి ఇక్కడ దేవత, బ్రహ్మసూత్రాల్లో చెప్పిన పరబ్రహ్మ స్వరూపం శ్రీవిద్యలో చెప్పిన పరాశక్తియే అని ప్రతిపాదిస్తూ శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యము పరమానందనాథులు వ్రాయటం కూడా జరిగింది. కేవలము ఈ మూడు రూపాలే కాక గణపతి, సూర్యుడు, సుబ్రహ్మణ్యుడు కూడా పరబ్రహ్మమే అని అర్చించేవారు మన దేశంలో ఉన్నారు. ఇలా సాకారోపాసన ద్వారా కూడా మోక్షం పొందవచ్చు అంటారు శంకరులు. అయితే ఇక్కడ గుర్తించాల్సింది ఏమంటే సాకారోపాసన చేసిన వారు మరణానంతరము పరమపదం చేరతారు. పరమపదము అంటే ఉత్కృష్టమైన చోటు, ఇతరులకు చేరటానికి సాధ్యంకాని చోటు అని అర్థం.

| | |
|---|---|
| ఈశ్వరుణ్ణి అర్చించే వారికి పరమపదం | – కైలాసము |
| విష్ణువును అర్చించే వారికి పరమపదం | – వైకుంఠం |
| శ్రీమన్నారాయణుడిని అర్చించే వారికి పరమపదం | – శ్వేతద్వీపం |
| శ్రీకృష్ణుణ్ణి అర్చించే వారికి పరమపదం | – గోలోకం |
| పరాశక్తిని అర్చించే వారికి పరమపదం | – మణిద్వీపం |

ఈ పరమపదంలో ఉండేది నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరబ్రహ్మకు ప్రతిరూపమయిన అపరబ్రహ్మ. అతడే సాకారబ్రహ్మ. కార్యబ్రహ్మ. సాకారాన్ని ఉపాసించిన వారు మరణానంతరము బ్రహ్మలోకం చేరతారు. ఇక్కడ బ్రహ్మలోకం అంటే ఉపాసకుడి ఉపాస్యదేవత ఉండే ప్రదేశం. అదే వైకుంఠం. కైలాసం మొదలైనవి అలా బ్రహ్మలోకం చేరి అంగుష్ఠమాత్రదేహులై, అక్కడ జరిగే నిత్యోత్సవ పక్షోత్సవాది ఉత్సవాలన్నీ చూస్తూ, అపరబ్రహ్మను సేవిస్తూ అక్కడే ఉండి కల్పాంతాన అపరబ్రహ్మతో పాటుగా పరబ్రహ్మలో లీనమవుతారు. దీన్నే క్రమముక్తి అంటారు. అయితే నిరాకారోపాసన చేసిన వారికి దేహపాతం జరగగానే, వారి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది.

మరణానంతరము నిరాకారాన్ని ఉపాసించే వారికి మోక్షం వస్తుంది. వారి జీవాత్మ పరమాత్మలు ఒకటౌతాయి. సాకారాన్ని అర్చించేవారు బ్రహ్మలోకం చేరతారు. దీన్ని ముక్తి అంటారు.

మధ్యమాధికారుల కోసం ఇక్కడ సాకారోపాసన చెబుతున్నారు. సాకారము అంటే పరబ్రహ్మ కన్న వేరైన అష్టమూర్తులు.

**పంచభూతాని చంద్రార్కావాత్మేతి మునిపుంగవ**

**మూర్తిరష్టౌ శివస్యాహ ర్దేవ దేవస్య ధీమతః**

**ఆత్మాతస్యాఽష్టమీ మూర్తి ర్యజమానా హవయాపరా ॥**

పంచభూతాలు, చంద్రుడు, సూర్యుడు, యజ్ఞదీక్షగల సోమయాజి వీరు అష్టమూర్తులు.

1.భవుడు 2.శర్వుడు 3.ఈశానుడు 4.పశుపతి 5.రుద్రుడు 6.ఉగ్రుడు 7.భీముడు 8.మహాదేవుడు

వీరు అష్టమూర్తులు. ఈశ్వరగీతలో

**భూమిరాపోనఽలో వాయుః ఖం మనోబుద్ధి రేవచ**

**అహంకార మితీయం మేభిన్నా ప్రకృతి రష్టధా ॥**

పంచభూతాలు,మనస్సు, బుద్ధి, అహంకారము, అష్టమూర్తులు, **శక్తి రహస్యంలో**

**లక్ష్మీర్మేధాధరా సృష్టి ర్గౌరీ తుష్టిః ప్రభాధృతిః**

**ఏతాభిః పాహి తనుభిరష్టాభిర్మాం సరస్వతి ॥**

1.లక్ష్మి 2.మేధ 3.ధర 4.పుష్టి 5.గౌరి 6.తుష్టి 7.ప్రభ 8.ధృతి

**యోగశాస్త్రంలో**

**గుణభేదాత్మమూర్తిః అష్టధా పరికీర్తితా**

**జీవాత్మా చాంతరాత్మా చ పరమాత్మా చ నిర్మలః**

**శుద్ధాత్మా జ్ఞానరూపాత్మ మహాత్మా సప్తమ స్మృతః**

**అష్టమస్తేషు భూతాత్మే త్యష్టాత్మానః ప్రకీర్తితాః ॥**

గుణభేదాల వల్ల ఆత్మ ఎనిమిది రకాలవుతున్నది. 1.జీవాత్మ 2.అంతరాత్మ 3.పరమాత్మ 4.నిర్మలాత్మ 5.శుద్ధాత్మ 6.జ్ఞానరూపాత్మ 7.మహాత్మ 8.భూతాత్మ

**విష్ణు పురాణంలో** 1. సూర్యుడు 2.జలము 3.పృథివి 4.అగ్ని 5.వాయువు 6.ఆకాశము 7.దీక్షితుడైన బ్రాహ్మణుడు 8.చంద్రుడు

1.జ్ఞానేంద్రియాలు 2.కర్మేంద్రియాలు 3.అహంకార చతుష్టయము 4.ప్రాణపంచకము 5.భూతపంచకము 6.కామము 7.కర్మ 8.అవిద్య

ఇవన్నీ పరబ్రహ్మ కన్న వేరుగా అనిపించే అష్టమూర్తులు. వీరిని ఉపాసించటమే సాకారోపాసన.

ఇటువంటి ఉపాసనవల్ల అహంకార మమకారాలు నశించి వైరాగ్యం వస్తుంది. అప్పుడు సద్గురువు దగ్గర ఉపదేశం పొంది జగత్తు పరబ్రహ్మకన్న వేరుగా లేదని, ఈశ్వరుడు, తాను అంటే జీవాత్మ పరమాత్మలు వేరు కావని భావించి సంసార బంధనాల నుంచి విముక్తి పొందుతాడు. దేహపాతం జరిగిన తరువాత ముక్తి పొంది బ్రహ్మలోకం చేరి, కల్పాంతం వరకు అక్కడే ఉండి,కల్పాంతాన అపరబ్రహ్మతో పాటుగా పరబ్రహ్మలో లీనమవుతాడు. ఈ విషయాన్ని మనకు వివరించే దక్షిణామూర్తికి నమస్కారము.

**సర్వాత్మత్వమితిస్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే**
**తేనాస్య శ్రవణాత్తదర్థ మననా ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।**
**సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యా దీశ్వరత్వం స్వతః**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 10**

పరమేశ్వరుడు సర్వాత్మ స్వరూపుడు అనే విషయాన్ని చెబుతున్నారు. ఈ స్తోత్రాన్ని శ్రవణ మనన ధ్యాన సంకీర్తనల ద్వారా పదేపదే గుర్తు చేసుకోవటం వల్ల నేనే పరమేశ్వర స్వరూపాన్ని అనే భావనతో అద్వైత సిద్ధి కలుగుతుంది. ఈ లోకంలో అణిమాది అష్టసిద్ధి కలుగుతుంది.

ఈ శ్లోకంలో దక్షిణామూర్తి స్తోత్రాన్ని పఠించటం వలన కలిగే ఫలితాన్ని చెబుతున్నారు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అన్ని జీవుల యందు, అన్ని వస్తువుల యందు అంతర్లీనంగా ఉన్నాడు. పరమేశ్వరుడు అంతర్యామిగా అన్నింటి యందు ఉన్నాడనే విషయం **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు ఉద్దాలకుడికి చెబుతాడు.

"ఎవడు భూమిపైన, భూమిలోపల ఉంటాడో, తనలో ఉన్నప్పటికీ ఎవనిని భూమి ఎరుగదో, ఎవని శరీరమే భూమియో, లోపల ఉంటూనే ఎవడు భూమిని నియంత్రిస్తుంటాడో అతడే నీ ఆత్మ. నీ అంతర్యామి.

ప్రాణులు భూమిపైన ఉంటాయి. భూమిలో తాదాత్మ్యం చెందిన దేవతల లోపల ఉంటాయి. ప్రతి మానవుడి శరీరము భూమియే. అవయవాలు భూమియే. కాని తనలో ఉన్న వాడిని ఈ శరీరము, ఈ అవయవాలు ఎరుగవు. శరీరాన్ని, అవయవాలను నియంత్రించేది లోపల ఉన్న ఆత్మ.

నీటిలో నివసించేవాడు, నీటిలో ఉన్నప్పటికీ ఆ నీరు అతన్ని ఎరుగదు. ఆ నీరే అతని శరీరం. నీటిలో ఉంటూనే నీటిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అగ్నిలో ఉంటాడు. అగ్ని అతన్నెరుగదు. కాని అగ్నే అతని శరీరం. అగ్నిలో ఉంటూ అగ్నిని నియంత్రిస్తాడు. అతడే నీలో ఉన్న అంతర్యామి అయిన ఆత్మ.

అంతరిక్షంలో ఉంటాడు. కాని అంతరిక్షం అతన్నెరుగదు. అతడి శరీరమే అంతరిక్షం. అంతరిక్షంలో ఉంటూ, అంతరిక్షాన్ని నియంత్రిస్తాడు. అతడే నీలో ఉన్న అంతర్యామి అయిన ఆత్మ.

వాయువులో ఉంటాడు. వాయువే అతని శరీరం. కాని వాయువు అతన్నెరగదు. వాయువులో ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి, అతడే ఆత్మ.

ద్యులోకంలో ఉంటాడు. అదే అతని శరీరం. ద్యులోకం అతన్నెరుగదు. అక్కడే ఉంటూ ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే నీ అంతర్యామి అయిన ఆత్మ.

ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకం అతన్నెరుగదు. ఆదిత్య లోకమే అతని శరీరం. ఆదిత్యలోకంలో ఉంటూ, ఆదిత్య లోకాన్ని నియంత్రిస్తాడు. అతడే నీ అంతర్యామి. ఆత్మ.

దిగంతరాళాల్లో ఉంటాడు. అయినా దిక్కులకు అతనెవరో తెలియదు. అక్కడ ఉంటూ దిక్కులను శాసిస్తాడు. అతడే నీ అంతర్యామి. ఆత్మ.

చంద్రునిలోను, నక్షత్రాలలోనూ ఉంటాడు. కాని అవి అతన్నెరుగవు. అక్కడ ఉంటూనే వాటిని శాసిస్తాడు. అతడే నీ అంతర్యామి, ఆత్మ.

ఆకాశంలో ఉంటాడు. కాని ఆకాశం అతన్నెరుగదు. ఆకాశమే అతని శరీరం ఆకాశంలో ఉంటూ, ఆకాశాన్ని శాసిస్తాడు. అతడే అంతర్యామి. అతడే నీ ఆత్మ.

అంధకారంలో ఉంటాడు. కాని అంధకారం అతణ్ణి ఎరుగదు. అంధకారమే అతని శరీరం. అంధకారంలో ఉంటూనే అంధకారాన్ని శాసిస్తాడు. అతడే నీ ఆత్మ.

తేజస్సులో ఉంటాడు. సమస్త భూతాల్లో ఉంటాడు. ఇంద్రియాల్లో ఉంటాడు. బుద్ధిలో ఉంటాడు. కాని ఇవేవీ అతన్ని ఎరగవు. వాటిలో ఉంటూ, వాటినే శాసిస్తాడు. అతడే అంతర్యామి. అతడే నీ ఆత్మ.

అతడు కనుపించడు, కాని చూస్తాడు. వినిపించడు కాని వింటాడు. అతడు తెలియబడడు. అర్థం కాడు. కాని అతనికి అన్నీ తెలుసు. అతడే నీ ఆత్మ. అంతర్యామి శాశ్వతుడు. అతడు తప్ప అన్నీ నాశనమయి పోయేవే."

సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా మానవదేహంలో ప్రవేశించాడు అని చెబుతోంది **ఐతరేయోపనిషత్తు.**

ఈ రకంగా పరమేశ్వరుడు సర్వాంతర్యామిగా జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అటువంటి పరమేశ్వరుణ్ణి ఉపాసన చేస్తే అద్వైతసిద్ధి కలుగుతుంది. ఉపాసకుడు నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలుసుకుని అంత్యకాలంలో మోక్షం పొందుతాడు.

జీవించినంత కాలము సుఖసంతోషాలతో, భోగభాగ్యాలతో, పిల్లాపాపలతో హాయిగా జీవిస్తాడు. అంతేగాకుండా అష్టసిద్ధులు కూడా పొందుతాడు. అష్టసిద్ధులు అంటే

1. అణిమాసిద్ధి – అతిచిన్నదైన రూపాన్ని పొందటం.
2. మహిమాసిద్ధి – అతిపెద్దదైన విరాడ్రూపాన్ని పొందటం
3. గరిమాసిద్ధి – బ్రహ్మాండం కన్న ఎక్కువ బరువుగా ఉండటం
4. లఘిమాసిద్ధి – దూదికన్న తేలిక అయిపోవటం
5. ప్రాప్తిసిద్ధి – కావలసిన వస్తువులను పొందటం
6. ప్రాకామ్యసిద్ధి – ఆకాశ గమనము
7. ఈశత్వ సిద్ధి – అన్నింటి మీద అధికారము కలిగి ఉండటము
8. వశిత్వసిద్ధి – అన్ని భూతాలను తనవశంలోకి తెచ్చుకోవటము

ఇవన్నీ సిద్ధపురుషులకుండే శక్తులు. దక్షిణామూర్తి స్తోత్రాన్ని ఉపాసించిన వారు తమకు కావాలంటే అష్టసిద్ధులు కూడా పొందగలుగుతారు. ఈ రకంగా ఉపాసకులు ఇహంకాని, పరంకాని ఏది కావాలంటే అది పొంది మరణానంతరము మోక్షం పొందుతారు.

*శ్రీ క్రోవి పురుషోత్తమశర్మ, శ్రీమతి లక్ష్మీనరసమ్మ గార్ల పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ గార్ల జ్యేష్ఠ పుత్రుడు, హరితస గోత్రీకుడు,* ***పరమానందనాథ*** *దీక్షానామధేయుడు అయిన* ***క్రోవి పార్థసారథి*** *సర్వజనామోదము పొందునట్లుగా, సులభశైలిలో వ్రాసిన* ***'శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము'*** *సమాప్తము.*

*సర్వేజనాః సుఖినోభవన్తు*

*సమస్త సన్మంగళాని భవన్తు*

*ఓం తత్సత్*

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యుదానం
వర్షిష్ఠాంతే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే ॥

విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివో ద్భూతం యథా నిద్రయా ।
యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమే వాఽద్వయం
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 1

బీజస్యాఽంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనా వైచిత్ర్య చిత్రీకృతం ।
మాయావీవ విజృంభయ త్యపి మహా యోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 2

యస్యైవ స్ఫురణం సదాత్మక మసత్కల్పార్థకం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్ ।
యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తి ర్భవాంభో నిధౌ
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 3

నానాచ్ఛిద్రఘటోదర స్థిత మహా దీప ప్రభాభాస్వరం
జ్ఞానంయస్యతు చక్షురాదికరణ ద్వారా బహిస్స్పందతే ।
జానామీతి తమేవ భాంతమను భాత్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 4

దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహ మితి భ్రాంతాభృశం వాదినః ।
మాయాశక్తివిలాస కల్పిత మహా వ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 5

రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోప సంహరణతో యోఽ భూత్సుషుప్తః పుమాన్ ।
జాగ్రత్స్వప్నమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 6

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థా స్వపి
వ్యావృత్తా స్వనువర్తమాన మహమిత్యంత స్ఫురంతం సదా ।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోముద్రయాభద్రయా
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 7

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః
శిష్యా చార్యతయా తథైవపితృ పుత్రాద్యాత్మనా భేదతః ।
స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయా పరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 8

భూరంభాంస్యనలోనిలోంబర మహర్నాథో హిమాంశుఃపుమాన్
నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।
నాన్యత్కించ న విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 9

సర్వాత్మత్వమితిస్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే
తేనాస్య శ్రవణాత్తదర్థ మననా ద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।
సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యా దీశ్వరత్వం స్వతః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 10